# సహజానంద వ్యాసావళి

సహజానంద వ్యాసావళి

రచన

సహజానంద టి. నాగప్ప వకీలు - గద్వాల

1992

వెలరూ. 10/-

B

# సహజానంద వ్యాసావళి

రచన

సహజానంద టి. నాగప్ప వకీలు - గద్వాల

1992

వెలరూ. 10/-

# పీఠిక

శ్రీమదచలర్షి రామడుగు శివరామ దీక్షితాచల గురుపీఠ రాజయోగాశ్రమము సికింద్రాబాదు పక్షమున నర్సాపురం నుండి 1965 నుండి 1977 వరకు మాఅన్నగారగు సదానంద ఇ. వీ. వేం. రామచంద్రరావుగారి సంపాదకత్వమున "రాజయోగి" మాసపత్రిక వెలువడినది. శ్రీ ఇలపకుర్తి వారి వ్యాసములు వారి శిష్యమండలివారు సంపుటీకరించి పరిపూర్ణబోధ వ్యాసమంజరి, గురుస్తోత్రములను పేర 5 సంపుటములు ముద్రించిరి. అనంతపురం జిల్లా వాస్తవ్యులు శ్రీకురబ ఓబులపతిగారు తనయొక్కయు కురుబసుబ్బరాయుడుగారి యొక్కయు తత్త్వములను, వ్యాసములను ఒక సంపుటె రాజయోగి అనుపేర ముద్రించిరి. నాతత్త్వములు కూడ పరిపూర్ణ రాయోగ తత్త్వప్రకాశిక, తత్త్వసుధలుగ ముద్రింపబడెను.

మా అగ్రజులైన శ్రీ సహజానంద టి. నాగప్పగారి వ్యాసములు కూడ ఒక సంపుటిగా ప్రింటు చేయించిన బాగుండునను తలంపు నాలో కలిగెను. 1990 సం.రము నవంబరులో మహబూబ్‌నగర్ జిల్లా కొల్లాపురం తాలూకాలోని మండలకేంద్రమగు పానుగల్లునందు ఉపపీఠస్థాపన జరిగెను. తత్సందర్భమున సహజానందులవారి శిష్యుల నుద్దేశించి నాలోని తలంపును సభాముఖమున వెల్లడించితిని. సహజానందుల వారి శిష్యులు ముఖ్యముగా అలంపూరు తాలూకా ప్రాగ్టూరు గ్రామ భక్తమండలివారు అందుకు సంసిద్ధులైరి.

అందువలన "సహజానంద వ్యాసావళి" అనుపేర గ్రంథముద్రణకు పూనుకొనినైని. ఈ వ్యాసాలు శ్రీ శివరామ దీక్షితీయ అచల సిద్ధాంతము యొక్క విశిష్టతను తెలిసికొనుటకుపకరించగలవు. జిజ్ఞాసువులు ఈ గ్రంథమును చదివి అందలి విషయములను సాకల్యముగా అవగతమొనర్చుకొని ఈ బోధను క్రమపద్ధతిగా గ్రహించగలరని ఆశిస్తున్నాను.

గ్రంథముద్రకు తోడ్పడిన ప్రాగ్టూరు భక్తమండలి వారికి సద్గురు కృపా కటాక్షములు. సకాలములో ముచ్చటగా ముద్రణగావించియిచ్చిన ప్రీమియర్ ప్రెస్ సికింద్రాబాదు వారికి కృతజ్ఞతలు.

గద్వాల,
17-10-91.

ఇట్లు,
అమలానంద పాటల పండరినాథ్

# అచల పరిపూర్ణ ప్రబోధయే
# పరిశుద్ధ ప్రబోధ

అచల సిద్ధాంతము చాలా ప్రాచీనమైనది. ఈ సిద్ధాంతము యొక్క ప్రచారము, వ్యాపకము, తెలంగాణా ప్రాంతములో తక్కువగానూ మద్రాసు ఆంధ్రప్రాంతములో యెక్కువగానూ జరిగినట్లు ఏతత్సాంప్రదాయక గ్రంధాలవల్ల తెలియబడుచున్నది. ఈ యచల సిద్ధాంతమునకు వ్యతిరేకమైన విమర్శలుకూడ అధికముగా యీప్రాంతాలలోనే జరిగినవి. ఇప్పటికి జరుగుచున్నవి. ఈ వ్యతిరేక భావాలు యొక్కప్పుడు తీవ్రరూపము దాల్చుటయు కద్దు. విమర్శకులు కొన్ని యెడల ఔచిత్యముగూడ కోల్పోయి విమర్శలు సాగించినారు. ఈ విమర్శలకు ప్రతి విమర్శలు చేయడము యచల సాంప్రదాయకులకు తత్వతః కూడని పని. ఈ విమర్శలు " ఎఱుక " చేష్టలని భావించి త్రోసిపుచ్చడమే సముచితము. ఐనను కొందరు విమర్శకులకు తగు సమాధాన మివ్వడమే భావ్యమని తలంచినారు. శ్రీ ఇలపకుర్తి వీర వెంకట రామచంద్రరావు, బి.ఏ,బి.యల్., నర్సాపురం పశ్చిమ గోదావరి జిల్లా రచించిన దుర్విమర్శాంధకారభాస్కరమను గ్రంథములో విమర్శకులకు చక్కటి సమాధాన మివ్వబడినది.

విమర్శ ప్రతి విమర్శల విషయమటుంచి, యీ యచల సిద్ధాంతము యొక్క విశిష్టతను గురించి, కొంత విచారింతము. ఈ సిద్ధాంత మందు జన్మరాహిత్యము కొరకు యొక ప్రత్యేక పద్ధతి ప్రతిపాదించ బడినది. దానిని భ్రాంతి రహిత, అశరీర పద్ధతి, లేక అస్పర్శయోగమని యందురు. ఈ భ్రాంతి రహిత పద్ధతిని తెలుసుకొనుటకు కొన్ని విధి నిషేధములను పాటించవలసి యుండును. యే ఇతర సాధనలందు ఆసక్తిలేక యుండవలెను. అచల సిద్ధాంత గురు పరం పరలో యొకరగు శ్రీ భాగవత కృష్ణ దేశికులు రచించిన శుద్ధనిర్గుణ తత్వకందార్ధదర్పులు అను గ్రంధమందలి క్రింది కందార్ధం గమనించ తగినది.

**కందార్థము :-**

ఏసాధన నీకెందుకు, వీసానికి పనికిరాదు, వినుమాయయ్యా నేసాధులచే విన్నది యేసాధనలేని బోధ నెరిగింతుపోకు; సాధనలందు మరిగితేరాకు; యే

సాధనలజోలినే నొల్లనని నీవు బాసజేసితివేని పరిపూర్ణ బోధనే నెరిగింతు పోకు; సాధనలందు మరిగితేరాకు;

యోగసాధనలవల్ల చిత్తశుద్ధి కలగవచ్చును. ముద్రల వల్ల సమాధులవల్ల ఆత్మానుభవము పొందెదము అని అనుకొనవచ్చును. అయితే వీటియొక్క అంతిమ లక్ష్యము "ఎఱుక". ఎఱుకకు అతీతమైన పరిపూర్ణ పరబాహ్యాము తెలుసుకొనుటకు యీ సాధనలు నిష్ప్రయోజనము.

కం|| జనులాత్మానుభవంబైనను ముక్త్యని పలికిరిట్లు నమ్మకు మెరుకే
కనరాదెచ్చట; గురుకృప అనుభవమెవ్వరికి పైన ఆమాట
నిజమో అనుభవముళ్ళక్కీమాట నిజమో వినజెప్పమీ
రెండు వివరించి, పైమాటవిని, నేముందరిబోధ వినిపింతు
వేవేగ, ఆమాటనిజమో, అనుభవముళ్ళక్కీ మాట నిజమో

కం|| మరుపన తొలిమేనులు మూడు, ఎఱుకన నాల్గవ శరీర,
మీ రెండొకటే; పరిపూర్ణ మవలి దీవలి యెరుకను గురు
వాక్కుచేత యెగురజిమ్మినను పోవును; లేని దెరిగే దేగి
నను యెరిగేదేలేకుండు యేమో ఆవలిజాడ, యెరిగేవా
రెవరింక, యింతేచా లెరు కానుయెగురజిమ్మినను పోవును
లేనిదెరిగే దేగినను

కం|| చూపులలోగల వస్తువు చూపులుగను వస్తువులును చూపులు
కూడన్ తేపకు యెరుకని తెలియుము చూపులులేనట్టి బయలు
చూచేదింకేమి యెరుకేలేదు తోచేదింకేమి దీపామువలే
కనుపాపలో గనువస్తువే పరమాత్మని చూపితే యెరుకాయు
చూచేదింకేమి యెరుకేలేదు తోచేదింకేమి.

కం|| ఎరుకనమరుపనరానిది పరిపూర్ణం, ఈశ్వరుడనబడు నెరుకే,
యెరుకన్ మరచిన జీవుండనబడు, యెరుకచలము నెరుగ
నరుగు యెరుకమరువులున్.

ఎరుక మరుపులు కానిది పరిపూర్ణపరబ్రహ్మమని పైకందార్ధములవల్ల తెలియగలదు. పరిపూర్ణ ప్రబోధనకు సాధనలు పనికిరావు.

ఇదియునుగాక శరీరముతో, చేయు సాధనలవల్ల సాధ్యమైనది సశరీర పద్ధతి యనిపించును. అశరీర పద్ధతి కాజాలదు.

ఈ సాధనవల్ల మరి ముద్రలవల్ల దైవభ్రాంతి కలుగును. భ్రాంతిరహిత పద్ధతి తెలుసుకొనుటకు దీనివల్ల అవరోధమేర్పడును.

దైవభ్రాంతివలెనే కర్మభ్రాంతికూడ నిషేధము.

కం|| జ్ఞాన, వైరాగ్య, భక్త్యసమానసదీస్నాన, దేవ, మంత్రపఠన,
తద్ధ్యాన, మఖ, తంత్రములు, పరమానినిరతిగోరు
నట్టి మనుజా సంఘముకు, బోధను దెల్పుమనిన, వారలకు
తాను బోధించుట తగదు, బోధించితే తాను నేనను
భ్రాంతి తొలగేదేలాగు, అట్టి మనుజా సంఘముకు
బోధను దెల్పుమనిన వారలకు

కర్మవల్ల కర్మ అధికమగునేకాని కర్మరహితము కాజాలదు, కర్మకు కారణము జ్ఞానము, జ్ఞానమువల్ల కర్మ, ఈ రెండూ అవినాభావ సంబంధము కలిగినవి. కార్యమున్న కారణముండును. కారణమున్న కార్యము జరుగును. కార్య కారణ రాహిత్యము కానిదే, జన్మరాహిత్యము కాజాలదు. కావున పరిపూర్ణ ప్రబోధచేత కార్యరాహిత్యముతోపాటు కారణరాహిత్యమైతేనే జన్మరాహిత్యమగును. ఇట్టి పరిపూర్ణ ప్రబోధను తెలుసుకొను జిజ్ఞాసులు భ్రాంతిజనకములగు సాధనలందుకాని, కర్మలయందుకాని, మోహము జెందకుండుట ముఖ్యము.

శాస్త్ర వాసనవల్లకూడ, పరిపూర్ణ ప్రబోధను తెలిసికొనుటకు గొప్ప అవరోధము గలుగును. గనుక శాస్త్రజన్యజ్ఞానమున కతీతమగు అచల పరిపూర్ణప్రబోధకు శాస్త్ర వాసనలు నిషేధములు, శాస్త్రాల వల్ల యెరుక నశించదు. ఆత్మ అనాత్మల వివరమువరకే యాశాస్త్రాలు యుపకరించును. ఆత్మానాత్మల కవ్వలిది, కేవాలాత్మలేక అచల పరిపూర్ణ పరబ్రహ్మము, ఆత్మయనగా ఎఱుక, అనాత్మయనగా మరపు. ఎఱుక మరుపులుగానిది పరిపూర్ణమని, అచలమని, బయలని, బట్ట బయలని, ప్రత్యక్షమని, గురుగుహ్యమని, గోప్యమని, నిత్యమని, సత్యమని, యెరుంగవలయును.

కందార్థము|| అందముగా సద్గ్రంధము చందము వినిపింతు, దాని చదివిన వినినన్, ముందుగ బయలెరుకై, యేసందున లేనెరుక లేక జనవలె సుమ్మీ. అదే యిది విని చదువునమ్మి, ఎందుకు నీకింక యితర శాస్త్రముల జోలందుగుర్తుండిపోదది గాన యీయెరుక జనవలెసుమ్మి అదే యిది వినిచదువునమ్మి.

శ్లో|| సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణంవ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో మోక్ష్యయిష్యామి మాశుచః భ| గీ

శ్రీకృష్ణపరమాత్మ తన శిష్యుడగు అర్జునునకు, సర్వధర్మములను పరిత్యజింపుమని యుపదేశించినాడు, ధర్మములనగా అంతకుముందు యుపదేశిం

పబడిన సాంఖ్యము. యోగము నిష్కామకర్మయోగము మొదలగునవియని తెలుసుకొనవలయును, శాస్త్రములతో పనిలేదు. ధర్మాధర్మముల నిర్ణయము లేదు. పాప పుణ్యములు లేవనికాదు, దీని యర్థము, త్రికరణశుద్ధితో ఆచరించువాడే పరిపూర్ణ బోధకు అధికారియని నొక్కి వక్కాణింపబడినది. కంద|| మనసున వాక్కున తనువున పనియొక్కటె జరుపునట్టి భక్తునికి దయన్, వినిపించుము వినుమని యూఘనబోధను, వీనికతుకగలదు డుగకుమీ!

కంద|| మనసున నొక్కటి దలచు. వాక్కుననొక్కటి బలుకుచుండు, కుటిలుడు, మరితా తనువున నొక్కటిజేయును. విను, వీనికిబోధ దెలుప విహితమటోయీ|| ఇట్టి విధి నిషేధములను పాటించు గురుకృపాపాత్రులై నట్టివారికే పరిపూర్ణబోధ తెలియగలదు.

అచలగురు సాంప్రదాయమును, నిజమగు సాంప్రదాయమనికూడ యందురు. మాయావాదమునకు భిన్నముగాను, యున్నది యున్నట్లుగాను, ప్రబోధించునది గనుకను, యీ సంప్రదాయము నిజగురు సాంప్రదాయమను పేరుతో వ్యాపకమైనది. ఈ సాంప్రదాయముతో యేలాటి సంబంధము లేనివారికి, పరిపూర్ణ ప్రబోధయన యెట్టిదో తెలియుట యసాధ్యమనే చెప్పవచ్చును.

కం|| తాబేటి తలవుచేతను తాబేల్పిల్లలక్షుదార్తి
తలగుట తెలియన్, తాబేటి గర్భమందున, తాబేలై పుట్టకున్న
తరమా యితరులకు, సద్గురు బోధట్లరయ నితరులకు,
యేబాధలెరుగాని యీబోధగలవారిచే బోధ బడయాక
చేకొనదలచితే, తరమా యితరులకు సద్గురుబోధట్లరయ
నితరులకు

కం|| నేనెంత లెస్స జదివిన, దీనిని తెలియంగగలరె, దేశికవర్యున్,
పూని సేవించకుండిన మానవు లది యెట్లనన్న మరి వినవోయి
నామాటందు మనసుంచవోయి. వానకాలములోని వర్షాము
నొక బిందువైన మిట్టను నిల్వదది నిశ్చయమెకద మరివినవోయి
నామాటందు మనసుంచవోయి.

కందార్థము:- అపరోక్షమౌనె మనుజులకు, పరోక్షంబైన బయలు గురుకృపలేకన్, అపరోక్షమవును మనుజులకు, పరోక్షంబైన బయలు గురుకృపగలుగా, కీలిదెలేనిమెరుక తాతొలుగా, విపరీతమౌ బుద్ధి విడిచి నీవెప్పుడు యుపచారములు చేయుచుండుము. గురునకు గురుకృపగలుగ, కీలిదె లేనిమెరుక తాతొలుగ|| గనుక విమర్శకులు శుష్క విమర్శలకు వాద

వివాదములకుదిగి తమ శక్తి సామర్థ్యములను వృధా చేసుకొనుటకు బదులు, అభిమానమును విడిచి, యచల సిద్ధాంతముయొక్క విశిష్టతను నిజమగు గురువులచే, తెలుసుకొనుటకు ప్రయత్నించినచో వారికే మేలుకలుగును.

అచల సిద్ధాంతము కొంత వ్యాప్తి జెందినది. అయితే చట్టబద్ధమైన పీఠములేకుండినందున యీ సంప్రదాయములో కాలక్రమేణ గలుగుచుండిన చెడుగుల సవరించుట కవకాశము లేకుండెను. కనుక సికింద్రాబాదులో (రాజయోగాశ్రమము, కంజరిగూడెం నెం 2362) చట్టబద్ధంగా శ్రీ రాముడుగు శివరామదీక్షిత అచలగురుపీఠ మేర్పడినది. ముద్గురువర్యులగు శ్రీ దయానంద పొన్నాల రాజయోగిగారు యీ పీఠమున కధిపతులు. పలుప్రాంతములలో యీ పీఠమునకు సంబంధమగు యుపపీఠములు నెలకొల్పబడినవి. వీటిద్వారా బహిరంగసభలు జరిపి వేదాంత విచారణలు విరివిగా జరిపింపబడుచున్నవి.

శ్లో|| అర్థస్య నిశ్చయోదృష్టో విచారేణ హితోక్తితః
నస్నానేన, నదానేన, ప్రాణయామశతేనవా; వి.చూ||

తత్వమస్యాది మహావాక్యార్థము యొక్క విశ్చయము కేవలము విచారణ వల్ల తెలుసుకొని ఆత్మ సాక్ష్మాత్కారము పొందదగును. కాని పుణ్యనదులలో స్నానముచేయుటవల్లకాని, దాన ధర్మములచేతకాని ప్రాణాయామమువల్లకాని తత్వనిశ్చయము కానేరదని శంకరాచార్యులు వారు వచించినారు. మహావాక్యవిచారణవల్ల గలుగు ఫలము యెరుక నిర్ణయముమాత్రమే, ఎరుక నిర్ణయమునకే విచారణ మవసరమైనయడల ఎరుక నిరసనమునకు విరివిగా విచారణ యవసరమని వేరేచెప్పనక్కరలేదు గదా.

అన్ని మతములవారు యీ అచల సిద్ధాంతమును తెలుసుకోవలసిన అవసరముకలదు. అన్ని జాతులవారికీ యిది అవసరమైన సిద్ధాంతము. మతాభిమాన జాత్యహంకారములవల్ల ప్రపంచములో జరుగుచున్నట్టి అక్రమములు, అన్యాయాలు, లోకవిదితములు. వీటిని రూపుమాపాలంటె సర్వమానవ సౌభ్రాతృత్వమేర్పడవలెనంటె, లోకకళ్యాణము కలుగవలెనంటె, యీ అచల పరిపూర్ణ ప్రబోధవల్లననేకాని. అన్యమార్గములచేత సాధ్యపడదని, ఘంటాపథంగా చెప్పవచ్చును. ఎరుక నశించనంతవరకు అభిమానము అహంకారము నశించదు. ప్రతి మతమువారు తమ మతమే యితర మతాల కంటే శ్రేష్ఠమని అభిమాన పడుచుందురు. ఈ అభిమానమే యెరుక. నేను పెద్దకులం వాణ్ణి. నేను చిన్నకులంవాణ్ణి అని అనునది ఎరుకే. నేనుబ్రహ్మమును నేను జీవుడను, నేను భక్తుడును, నేను నిష్ఠాగరిష్ఠ

డను, నేను వ్రతాచార సంపన్నుడను; నేనుసంపన్నుడను, నేనుదరిద్రుడను అనునది ఎరుకే. నేను నీవు పరులని అనునది ఎరుకే. ఆత్మ ఎరుకే. అధిష్ఠానబ్రహ్మమూ ఎరుకే. ఈశ్వరుడెరుకే. జీవుడెరుకే జీవేశ్వరైక్యత ఎరుకే. అన్నిటికి సత్తారూపముననున్న ఈ యెరుక కతీతమైనది అచల పరిపూర్ణ పరబ్రహ్మము, నీవు నేను అనని పరబ్రహ్మము. ఇట్టి పరిపూర్ణ పరబ్రహ్మమే నిత్యమైనది, సత్యమైనది, పుట్టనిది, చావనిది, చలించనిది; అందు, లేనెరుక లేకనే తోచుచున్నదని, గురువుచేత తెలుసుకొని, తెలిసిన తెలివిని విడుచుటయే, గురుమేలుకయగును.

శ్లో|| ఉల్కాహస్తో యథాకశ్చిద్ద్రవ్యమాలోక్యతాంత్యజేత్
జ్ఞానేనజ్ఞేయమాలోక్య, పశ్చాత్ జ్ఞానం పరిత్యజేత్ ఉ - గీత

ఆ || ఎరుక బ్రహ్మమనియె, యిల శంకరార్యులు
తెలివి బ్రహ్మమనుచు తెలిపెవ్యాసు
లెరుక తెలివి గతులు, యెరుగడు వేమన
విశ్వదాభిరామ వినురవేమ||

నేను నీవు అనునదియెరుక, ధర్మాధర్మముల నిర్ణయించునది యెరుక. ఈ యెఱుకయే జనన మరణములకు, బంధమోక్షములకు, పాప పుణ్యములకు, ధర్మా ధర్మములకు, సత్యా సత్యములకు వాదభేదములకు మూలకారణము. ఈ యెరుకను కూకటివేళ్లతో తీసివేయునది అచలసిద్ధాంతం. ఎరుక రహితమే పరిపూర్ణ ప్రబోధయొక్క ఫలము. అహంకార మమకారములు (నేను నాది), బంధమోక్షములకు కారణమని మతాలవారు చెప్పలేదాయని ప్రశ్నించవచ్చును. స్థూల రూపమైన అనగా పిండాండమందలి అహమత్వ మమత్వములను మతాలు నిరసించినవి కాని అఖండ యెరుకను నిరసించలేదు. "అహం బ్రహ్మాస్మి" నేను బ్రహ్మను, నేను ఈశ్వరుడను అని చెప్పినపుడు లేక భావించునపుడు, గోచరమయ్యేది యేమతములో నిరసించబడలేదు. అఖండ రూపమగు యెరుకయే స్థూలరూపముగా పరిణమించును. స్థూల రూపముగానున్న ఎరుక లేక జీవుడు సూక్ష్మరూపమైన ఎరుక యందు అనగా ఈశ్వరుని యందు ఐక్యముగావడమే మోక్షమని, మతాల వారు చెప్పచుందురు. సూక్ష్మరూపమైన యెరుక యందు స్థూలరూపమైన యెరుక లయమైనంతమాత్రాన యెరుక నిర్మూలనముగాదు. ఎరుక తనంతతాను విడిపోదు. నిజగురు సాంప్రదాయకులగు పరిపూర్ణ ప్రబోధకులు తప్ప యెవ్వరు యెరుకను విడిపించలేరు.

కందార్థము :- ఎరుక తనకు దావీడిపో, దెరుకను విడిపించలేరు యెవ్వరుధాత్రిన్, గురుడొకడుదప్ప; గురునకు పరిచర్యయొనర్చి బోధ పద్ధతి వినినన్; తిరిగిరాని పద్ధతిగనినన్; పరిపూర్ణ మెరుక యేర్పరచ, నెరుక

లేక, హరిని స్వప్నముగన్న, కరిమ్రగ్గినట్టవు, యీపద్ధతివినినన్ తిరిగిరాని పద్ధతిగనినన్.

కందార్థము:- పరిపూర్ణమిదుగో, యిదిగోయెరుకని, చూపించి లేని యెరుకను లేదంచెరిగించిన గురుడేసరి. యెరుకనునిల్పేటి గురుడు యెందు కోయన్నా, తద్బోధ నీకెందుకోయన్నా శరణన్న వారి మస్తకమందు చేయిబెట్టి స్థిరముగా యెరుకాను తీసివెయ్యనివాడు యెందుకోయన్నా తద్బోధ నీకెందుకోయన్నా.

సర్వభ్రాంతులకు, సమస్తభ్రమలకు, యీ యెరుకయే మూల కారణ మైయున్నది. నీవు నేను అనునదే అన్ని భ్రాంతులకన్నా గొప్పభ్రాంతి, సూక్ష్మాతిసూక్ష్మము స్థూలాతిస్థూలముగా పరిణమించునది యీయెరుకయే. "అణోరణీయాన్ మహతోమహీయాన్" అను శ్రుతివాక్యము యీయెరుకకు సరిపోవును. స్థూల సూక్ష్మములు కానట్టి పరిపూర్ణమునకు సరిపోదు. పరిపూర్ణమందు, (నేననని పరబ్రహ్మమందు) యెరుక లేనిదని, లేకనే తోచుచున్నదని, నిజగురువులచేత తెలిసికొని, ఎఱుక యేకోశమందు లేకుండునట్లు నాశనము జెందినపుడే, అచల పరిపూర్ణ పరబ్రహ్మము ప్రత్యక్షమగును. జననమరణ రాహిత్యము సిద్ధించును. ఇదే శ్రీ రామ దుగు శివరామదీక్షితులవారి నిర్ణయము. ఇదే భాగవత కృష్ణదేశికుల వారి నిశ్చయము.

కందార్థము :- పరిపూర్ణ మెరుకలెట్టిదో, గురుముఖమున రెంట్ని లెస్సగురు తెరి గెరుకన్ సరిపుచ్చుకొన్న మృషయని, పరిశుద్ధపు బోధయిది పాటించికనరా శివరాములపద్ధతి యిదెరా, నరులు కొందరు పర్కి రెరుకాను మ్రింగియీ పరిపూర్ణమయ్యే మంచెరుగాక చెడుటాకై పాటించి కనరా, శివరాముల పద్ధతియిదేరా.

కందా|| అల భద్రాచలమనిన బయలుగా గుర్రై రుగవలయు యెరుకనె విష్ణ్వందులదోచి గురునికృపచే నిలువక విష్ణ్వైగిరిపోతే నిశ్చయమదేరా కృష్ణ దాసు నిశ్చయమిదెరా, యిలమీద యెవరైన యీ కందార్థములలోపలి గూడార్థము దెలియ భ్రమను జెందరువారు నిశ్చయమదెరాకృష్ణదాసు నిశ్చయమిదెరా.

## శ్రద్ధాసక్తులు

| | | | |
|---|---|---|---|
| "జ్ఞాతుం. | ద్రష్టుం. | ప్రవేష్టుంచ," | భగవద్గీతావాక్యము |
| విను, | కను, | చను, | అచలసిద్ధాంతము. |

శ్రద్ధయనగ వేదాంత వాక్యములందును గురువాక్యములందును విశ్వాసము గలిగి యుండుట. ఆసక్తియనగ అపేక్ష ఆకాంక్ష, వేదాంత వాక్యములందు గురువుచే వుపదేశింపబడిన విషయములందమితమగు విశ్వాసము గలిగియుండి జనన మరణ రాహిత్యపద్ధతి తెలుసుకొన గోరుటయే శ్రద్ధాసక్తులు.

ఆత్మయననేమి? అనాత్మయననేమి? ఆత్మానాత్మల కతీతమైన కేవలాత్మయననెట్టిది? యిత్యాది విషయములు తెలిసికొనుటకు జ్ఞానము ముఖ్యము. ఇట్టి జ్ఞానము శ్రద్ధచేతనే లభించగలదు. శ్రద్ధ లేనిదే ముక్తి లేదనుటలో సంశయములేదు.

శ్లో|| శ్రద్ధావాన్‌లభతే జ్ఞానంతత్పరస్సం యతేంద్రియః
జ్ఞానం లబ్ధ్వాపరాంశాంతి మచిరేణాధిగచ్ఛతి|| భగ. 4-39

శ్లో|| అశ్రద్దధానాః పురుషాః ధర్మస్యాస్య పరంతప
అప్రాప్యమాంనివర్తంతే మృత్యుసంసార వర్త్మని భగ 9-3

శ్రద్ధలేనివారు పరమపదమును గానలేక జనన మరణముల బాధపడుచుందురు. గనుక ఆశయమునకు తగిన శ్రద్ధాసక్తులావశ్యకములు. ఆశయముయొక్క తరతమబేధములచేత శ్రద్ధాసక్తులయందును అంతరముండును. అత్యున్నతమైన ఆశయమునకు అత్యధికమైన శ్రద్ధాసక్తులవసరము. ఈ తరతమ భేదమును వ్యక్తము చేయుటకొరకై భగవద్గీతా వాక్యమును, శ్రీ శివరామదీక్షితీయ అచల సిద్ధాంతసారమును పైన నుల్లేఖింపబడినవి.

శ్లో|| భక్త్యాత్వనన్యయాశక్య అహమేవం విధోఽర్జున
జ్ఞాతుం దృష్టుంచతత్వేన ప్రవేష్టుంచ పరంతప. భగ. 11-54

శ్రీ కృష్ణభగవానుడు ప్రియశిష్యుండగు అర్జునునకు తన విశ్వరూప దర్శనము చేయించిన తర్వాత చెప్పిన వాక్యమిది. భక్తుడు అనన్యభక్తిచేతనే భగవంతుణ్ణి యదార్ధముగా తెలుసుకోగలడని దర్శించగలడని ప్రవేశించగలడనిన్ని దీనిభావార్థము. ప్రవేశించడమను పదమునకు, మోక్షమని, పొందడమని, అనుభవించడమని, తద్రూపము జెందడమని, చేరుటయని, ఐక్యమగుటయని, వేర్వేరు మతాచార్యులు వారివారి సిద్ధాంతానుసారం వేర్వేరర్థములు జెప్పిరి.

శ్లో|| భక్త్యామామభిజానాతి యావాన్ యశ్చాస్మితత్వతః
తతోమాంత్వతో జ్ఞాత్వావిశతే తదనంతరం || భగ. 18-55

భగవద్గీతయొక్క అంతిమ అధ్యాయమందలి పై శ్లోకములో కూడ విశతేయను పదముపయోగింపబడినది. పై రెండు శ్లోకముల భావార్థమొకటే, ప్రవేష్టుం, విశతేయను క్రియాపదములు "విశ్" ధాతువునుండి యేర్పడినవి. విశ్ యను ధాతువునకు ప్రవేశించుటయని యర్థము. విశతే "నుక్" (NUK)ప్రత్యయాస్త స్వరూపంవిష్ణుః విష్ణు శబ్దముకూడ విశ్ ధాతువునుండి యేర్పడినది.

శ్లో॥ యస్మాద్విష్టమిదం సర్వంతస్యాశక్త్యామహాత్మనః
తస్మాత్ సప్రోచ్యతే విష్ణుర్విశధాతో ప్రవేశనాత్ ॥
॥ విష్ణుపురాణం॥

ఆవిష్ణువు తన శక్తిచే సృజింపబడిన విశ్వమందు స్వయంగా ప్రవేశించుటచే విష్ణువని చెప్పబడుచున్నాడు. జీవుడు పరమాత్మ యొక్క అంశ.

శ్లో॥ మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః
మనష్షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థానికర్షతి.భగ. 15-7

ఈశ్వరాంశమైన జీవుడు యట్టి భగవత్తత్వమును అనన్యభక్తిచేత తెలుసుకొని దర్శించి అందు ప్రవేశించగలడని భగవద్గీతావాక్యార్థము. ఇదియే వేదాంత సారము. ఇట్లు భగవంతుని యందు ప్రవేశించుట లీనమగుట ఐక్యమగుట తద్రూపము పొందుటయే మోక్షమని కైవల్యమని వేదాంత విచారణయొక్క లక్ష్యనిర్దేశము. అయితే యిట్టి బ్రహ్మతత్వము లేక బ్రహ్మత్మైక్యత ఎఱుకయేగాని ఎరుకకతీతమగు పరిపూర్ణ పరబ్రహ్మము కాదని పరిపూర్ణబ్రహ్మ యందు ఎరుక ప్రవేశించదని (లేక దూరనేరదని) సిద్ధాంతము.

కం॥ బట్టబయలనుచు దీనికి మొట్టమొదల్ పేరులేదు
ముదమున ఎరుకే పుట్టి, పేర్పెట్టి దీనిని పట్టుకలవ్వాడలేక
పారిపోవునురా కనరాదిందు దూరనేరదురా పుట్టిచచ్చుచు
మళ్లి పుట్టి గిట్టుచు బుట్టు నిట్టి తిప్పలు నొందు ఎరుక
బయలునుచూస్తె పారిపోవునురా కనరాదిందు దూరనేరదురా

జీవేశ్వరైక్య పద్ధతి వల్ల ఎరుక తిరిగి పుట్టుచుండునని ఎరుక యొక్క నిర్మూలనమే తిరిగిరాని పద్ధతియని, జననమరణ రాహిత్యమున కిదియే చక్కటి మార్గమని తెలుపునది నిజగురుసాంప్రదాయము. ఈ సిద్ధాంతము ప్రకారము పరిపూర్ణ గురువులచేత పరిపూర్ణ మెరుకలనెరిగి పరిపూర్ణమును దర్శించి, పరిపూర్ణ పరబ్రహ్మ యందు ఎరుక తాలేనని చనడమే ఎరుకకు

పని.

ఇట్టి మహదాశయమునకు అత్యధిక "శ్రద్ధాసక్తు" లత్యంతావసరములు. "శ్రద్ధయాసత్యమాప్యతే" యను శృతివాక్యానుసారము శ్రద్ధచేతనే సత్యము కనుంగొన నగును.

# కల, మేలుకలు

గుహ్యం - గుహ్యతరం - గుహ్యతమం
గుహ్యాత్ గుహ్యతరం సర్వగుహ్యతమం ] శ్రీమద్భగవద్గీతా సారము.
గురుగుహ్యం. గురుమేలుక - శ్రీశివరామదీక్షిత అచల సిద్ధాంతము.

అసత్యమైనది సత్యమైనదిగా భ్రమింప చేయునదే కల. సత్యమైనదానిని తెలుసుకొని అసత్యమైనదానిని విడిచి యుండడమే మేలుక. "బ్రహ్మసత్యం జగన్మిధ్యా" అను వాక్యాను సారం సత్యమైనది బ్రహ్మ.మిధ్యా రూపమైనది జగత్తు. జనించునది గతించునట్టిది జగత్తు, గనుక మాయ, పుట్టని చావ నిది బ్రహ్మముగనుక సత్యమైనది. సత్యాసత్యములను తత్వ విచారణవల్లనే తెలుసుకొన వీలగును. సత్యాన్వేషణా ప్రయత్న ఫలితముగా మత మతాంతరములు సమాజములు సిద్ధాంతము లేర్పడినవి. యత్ దృశ్యంతత్ నశ్యం. దృశ్యమానమైన సర్వంనశ్వరం అని భావం. దృశ్యరూపమైన మాయా ప్రపంచముతో మానవుడు జాగ్రతావస్థలోను స్వప్నావస్థలోను సంబంధము గలిగి యుండి తాను చూచుచున్న వస్తువులయందును చేయుచున్న పనుల యందును మోహముజెంది సుఖదుఃఖము లనుభవించుచుండును. జనన మరణ బాధలకు కారణమైన కర్మబంధమున చిక్కుకొనును. సుషుప్త్యావస్థలో సర్వప్రపంచముతో తనకేలాటి సంబంధము లేక పోవుటచేయే పీడలు లేక నిద్రించగలుగును. మరి హాయిగానిద్రించితినని మేలుకున్న తర్వాత చెప్పగలుగును. కాని తాననవేమో ప్రపంచమనవేమో ప్రపంచమునకు తనకు గల సంబంధ మెట్టిదో చెప్పజాలడు. అధ్యాత్మిక తత్వవిచారణకిది మొదటి సోపానమని చెప్పవచ్చును. అవిద్యతో కూడకున్న యీ స్వల్పానందానుభూతికి మనస్సుయొక్క లయము కారణమని తారకము అమనస్కము మున్నగు పద్ధతుల ద్వారా మనస్సును వశపర్చుకొని బ్రహ్మానందానుభూతిని పొందవచ్చునని కొందరన్నారు. మనస్సు వాయుతత్వమునకు సంబంధించినది గనుక దానిని వశపర్చుకొనడ మసాధ్యమని జ్ఞానమార్గముచేత మనస్సును అధోముఖంగా పోనివ్వకుండిన యది ప్రాపంచిక విషయచింతలను మానుకొని ఊర్ధ్వగామియై పారమార్థిక చింతనకు సహాయకారి కాగలదని సంకల్పమే బంధహేతువని నిస్సంకల్పమే ముక్తియని మరికొందరన్నారు.

శ్లో|| ఈప్సితా నీప్సితేనస్తో యస్యాంతర్వర్తి దృష్టిషు
సుషుప్తి వద్యశ్చరతి సజీవన్ముక్త ఉచ్యతే.

సంకల్పమువల్ల జగము, జగమువల్ల సంకల్పము పుట్టును. ఇవి రెండునూ మిథ్యాస్వరూపములే. మిథ్యాయన మాయా. యామా సామాయా యేదిలేనిదో అది మాయా. మాయా అవిద్యలు గూఢమైనవి, సత్యాసత్యములు విద్యావిద్యలు జ్ఞాన జ్ఞానములు తత్వజ్ఞులగు గురువులవల్లనే తెలుసుకొనవలయును.

శ్లో|| గూఢా విద్యా జగన్మాయా దేహశ్చాజ్ఞాన సంభవః
విజ్ఞానంతత్ప్రసాదేన గురుశబ్దేన కథ్యతే || గురుగీతా ||

శ్లో|| తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతితే జ్ఞానం జ్ఞానినస్తత్వదర్శినః||భగవద్గీతా||

మాయ, అవిద్య అజ్ఞానము, అనాత్మ ప్రకృతి, శక్తి ప్రధానము అవ్యక్తము, నివి మాయయొక్క పర్యాయనామములు

పరాప్రకృతి అవిద్య అజ్ఞానము, అనాత్మప్రకృతి. శక్తి ప్రధానము అవ్యక్తము, నివి మాయయొక్క పర్యాయనామములు.

పరాకృతి, అపరాప్రకృతి (శుద్ధమాయ, అశుద్ధమాయ) యని ప్రకృతి రెండు విధములని, ప్రకృతి త్రిగుణాత్మక మని అనగా సత్వరజస్తమో గుణ స్వరూపముగనున్నదని కామ క్రోధమోహ సంశయములు జ్ఞానమును ఆవరించియున్నవని జ్ఞానము కంటె పవిత్రమైనది లేదని, జ్ఞానియైనవానికి భగవంతునికి భేదములేదని భగవద్గీతయందలి ఆయా అధ్యాయములలో విస్తారముగ శ్రీకృష్ణుడు అర్జునునకు ప్రబోధించినాడు. తొమ్మిదవ అధ్యాయంలో శ్లో|| ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామిపునః శ్లో|| మయా ధ్యక్షేణ ప్రకృతి స్సూయతేసచరాచరం, యని చెప్పబడుటచే పరమాత్మ తత్వము, మాయా యనునవి, రెండు వేరువేరుగా పేర్కొనబడినను యీ రెంటికి అవినాభావ సంబంధము గలదని స్పష్టమగును. చంద్రునివిడిచి వెన్నెల వేరుగాలేనట్లు జలమునువిడిచి రసము వేరుగాలేనట్లు యీరెండు నొక దానినివిడిచి నొకటి వేరుగా లేవు. గనుకనే జ్ఞానము గూఢము, అజ్ఞానముకూడ గూఢమైనదని చెప్పబడెను.

ఇట్టి జ్ఞానాజ్ఞానములగురించి భగవద్గీతయందు కర్మజ్ఞానభక్తి వైరాగ్యము లనే సోపానక్రమమున శ్రీకృష్ణుడు అర్జునునకు తత్వోప దేశము చేసినాడు తొమ్మిదవ అధ్యాయమందు ఉపదిష్టతత్వము గుహ్యతమమని చెప్పబడినందున అంతకుపూర్వపుఅధ్యాయములలోని తత్వోపదేశము కర్మకు సంబంధించినది

గుహ్యమని జ్ఞానమునకు సంబంధించినది గుహ్యతరమని విదితమగును. భగవద్గీతయొక్క క్రింది శ్లోకములు గమనింపతగినవి.

శ్లో|| ఏషాతే ऽ భిహితాసాంఖ్యే బుద్ధిర్యోగేత్విమాం శృణు
బుద్ధ్యాయుక్తోయయాపార్థ కర్మబంధంప్రహాస్యసి||2-39

శ్లో|| లోకేస్మిన్ ద్వివిధానిష్ఠా పురాప్రోక్తా మయానఘ
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం|| 3-3

శ్లో|| కింకర్మకిమకర్మేతి కవయో ऽ ప్యత్రమోహితా
తత్తేకర్మప్రవక్ష్యామి యద్జ్ఞాత్వామోక్ష్యసే ऽ శుభాత్ ||4-16

శ్లో|| జ్ఞానంతేంహంస విజ్ఞానమిదం వక్ష్యామ శేషతః||
యద్జ్ఞాత్వానేహ భూయో ऽ న్యద్జ్ఞాతవ్యమవశిష్యతే ||7-2

శ్లో|| ఇదంతుతే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే
జ్ఞానవిజ్ఞానసహితం యద్జ్ఞాత్వామోక్ష్యసే ऽ శుభాత్||9-1

శ్లో|| ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశే ऽ ర్జనతిష్ఠతి
భ్రామయన్ సర్వభూతానియంత్రా రూఢానిమాయయా||
తమేవశరణంగచ్ఛ సర్వభావేనభారత
తత్ప్రసాదాత్ పరాంశాంతింస్థానం ప్రాప్యసిశాశ్వతం||
ఇతితేజ్ఞానమాఖ్యాతం గుహ్యాత్ గుహ్యతరం మయా
విమృశ్యైతద శేషేణ యథేచ్ఛసితథాకురు18-63

శ్లో|| సర్వగుహ్యతమం భూయః శృణుమే పరమంవచః
ఇష్టో ऽ సిమే దృఢమితితతో వక్ష్యామితేహితం||18-64

ఈ సర్వగుహ్యతమమగు పరమాత్మతత్వము సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణంవ్రజ x x x x x x యని తర్వాత శ్లోకమందుప దేశింపబడినది. ఈరీతిగా భగవద్గీతయందు పదునెనిమిది అధ్యాయములలోను చివరివరకు మాయనుగురించి పరమార్థ తత్వమునుగురించి ప్రబోధించబడినందున కేవలము నామరూపములుగల స్థూలప్రపంచమెమాయ యనుటసరికాదు. సూక్ష్మాతిసూక్ష్మంగా కారణాత్మకంగా మాయ అత్మయందే యుండునని తెలియనగును. మాయయొక్క ఆది తెలియనందున మాయ అనాది, బ్రహ్మ అనాదియని వేదాంత సిద్ధాంతము. మాయా సహితబ్రహ్మ పరిపూర్ణ పరబ్రహ్మకాదని ఎఱుకయని, మాయ మరుపుయని ఎఱుక మరుపుల కతీతమైనదే అచలపరిపూర్ణ పరబ్రహ్మయని దానియందు, ఎఱుక మరుపులు లేనివని, నేననని బ్రహ్మయే పరిపూర్ణ పరబ్రహ్మయని అదియే నిత్యమైనది

సత్యమైనది పుట్టనిది చావనిదియని శ్రీ శివరామ దీక్షిత యచలసిద్ధాంతము. ఇదియే గురుగుహ్యము. గురుముఖతః పరిపూర్ణ మెరుకలను తెలిసికొని పరిపూర్ణ పరబ్రహ్మమందు తా లేనని తెలిసిన తెలివిని విడిచియుండుటే గురుమేలుక. ఇట్టి గురుమేలుక చేతనే జననమరణ రాహిత్యము తథ్యము.

కం|| మరణ సుషుప్తులు జెందిన పురుషుడు, మేల్కొనినవాడు. భువి తదితరుడౌ పురుషుడు కలగనువాడని యెరిగుండుము, మొదటి యతడు యెరుగడీరెంట్నే, రెండోపురుషుడెరుగునీ రెంట్నే-యిరువు రొక్క టెసుమ్మి తిరిగి పుటుదురు, వీరే గురునిచే మేల్కొంటె, తిరిగి పుట్టనెపుట్ట డెరుగాడీరెంట్ని రెండోపురుషుడెరుగునీ రెంట్ని.

# "నిశ్శబ్దోబ్రహ్మముచ్యతే"

"నిశ్శబ్దోబ్రహ్మముచ్యతే" యని యుత్తరగీతావాక్యం, శబ్దరహితమైనది బ్రహ్మమని దీని యర్థము. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు గానతానందున పరమాత్మ తత్వమే అవాఙ్మానస గోచర మన్నారు. "యతోవాచోనివర్తంతే అప్రాప్యమనసాసహ" యను శ్రుతివాక్యముకూడ యీ భావమునే వ్యక్తము చేయునన్నారు. "ఆత్మనః" ఆకాశస్సంభూతః; ఆకాశాత్ వాయుః; వాయోరగ్నిః; అగ్నే రాపః; అద్భ్యఃపృధ్వీ" యను శృతివాక్యానుసారం శబ్దగుణముగల ఆకాశతత్వమున కతీతమైనది ఆత్మ గనుక ఆత్మయే నిశ్శబ్దమైన బ్రహ్మమని అంటే - ఆత్మనుండే ఆకాశాది పంచమహా భూతిములుద్భవించినవి. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనే పంచతన్మాత్రలు ఆత్మయెక్క పరిణామములే గనుక ఆత్మను నిశ్శబ్దమగు బ్రహ్మమని చెప్పరాదు.

ఘటాకాశము మఠాకాశమందు, మఠాకాశము మహాకాశమందు లయము చెందడమే మోక్షమనియంటే - ఆకాశబయలు పరిపూర్ణ పరబయలు కానేరదు. ఎందుకంటే ఆకాశము శబ్దగుణము గలది. మరియు ఆకాశం గగనం శూన్యం యని శబ్దాధారమునుబట్టి యిది లేనిదనే చెప్పబడును గనుక నిత్యము సత్యమూ స్వతస్సిద్ధమూనైన పరిపూర్ణ పరబయలు ఆకాశబయలు యొక టేయని చెప్పరాదు. "బయలాకసమని కొందరు భయపెట్టెదరందువలన భయపడకుసుమీ, బయలందుశబ్దమున్నను బయలాకసమనుచు నమ్మబడనీ నీచేత, శబ్దము లేదీ భ్రమ యెందుచేత" యని శుద్దనిర్గుణతత్వ కందార్థ ములందు శ్రీ భాగవతకృష్ణ దేశికులు శలవిచ్చినారు. కం|| ఆకాశమనిన

శూన్యం బాకాశంబనిన సగుణమాకాశమనన్ కాకివలెనల్ల రూపుది యాకా శము మితములోన నణగుండుజుమీ||

కందార్థము|| ఆవరణము ఆకసము, నిరావరణము అచలమునుచు యునిరి మహాత్మ్కల్ ఆవరణము మితిగల్గిన దావారణము లేంది అమితమని తెల్సు కోరా! యీరెంట్నే వేరని కనుక్కోరా! ఆవరణము ననే నిరావరణ మునుజూచి ఆవరణమెడలిస ఆవలిమాటలేదని తెలుసు కోరా యీరెంట్నే వేరని కనుక్కోరా.

పై కందార్థ కందపద్యములలో పరిపూర్ణ పరబయులుకు ఆకాశ బయు లుకుగల భిన్నత్వము స్పష్టముగా చూపించబడినది. గనుక ఆకాశబయులు నిశ్శబ్దమైన బ్రహ్మము కాజాలదు.

"ఖంబ్రహ్మ" యను శృతివాక్యము ఓమిత్యేకాక్షరం బ్రహ్మయను భగ వద్గీతావాక్యముకూడ శబ్దబ్రహ్మమునే ప్రతిపాదించుచున్నవి. నిశ్శబ్దంబ్రహ్మ అను వాక్యమునకివి విరుద్ధముగా తోచును. ఆకాశమువలె వ్యాపకము జెందునది గనుక "ఖంబ్రహ్మ" యని అర్థము జెప్పినయెడల వ్యాపకము సంకోచములనేక్రియలకు బ్రహ్మము ఆశ్రయుడై యున్నందున నిష్క్రియుడు కానేరడు. శబ్దబ్రహ్మము అక్షర పరబ్రహ్మము, లేక స్వప్రకాశ బ్రహ్మము నకంటె పరిపూర్ణబ్రహ్మము అనునది వేరుకాదని యితరులందురు. కాని యిదిలేని యెరుకమాత్రమేయని యెరుకమరుపులు కానిది పరిపూర్ణపరబ్ర హ్మమని అచలసిద్ధాంతము నిర్ణయించినది. మరుపుకు తన్మాత్రలుగలవు యెరుకకుతన్మాత్రలున్నవీ రెండొకటె పరిపూర్ణమునకు లేవవి, పరిపూర్ణము యెరుక కాదు మరుపుకాదని శ్రీ కృష్ణదేశికులు తెలియజేసినారు. ఇంతే కాదు ధ్వనిమొదలగు తన్మాత్రలు కనుగొనగా లేశమైన గాన్పించనిచోటు. బట్టబయలని పరిపూర్ణపరబ్రహ్మమని చాటినారు. లేశమైనను యనగా బీజ రూపముగానైనను సూక్ష్మాతిసూక్ష్మముగా నైనను లేకుండునట్టిదనియర్థము. ఇతరుల వేదాంతమునకును అచల సిద్ధాంమునకునుగల యీభేదమును గమనించినయెడల నిశ్శబ్దోబ్రహ్మఉచ్యతే యను వాక్యము అచలసిద్ధాంత లక్ష్యార్థమగు పరిపూర్ణ పరబ్రహ్మమునకుసరిపోవునని స్పష్టముకాగలదు; అది యేనేననని బ్రహ్మ. నేననని బ్రహ్మ లోపలలేనిదె సంభవమునొంది లీల (ఎరుక) తనకు తామేనుజగములై వెలసెను, ఇది మృగజలమువలె, ఆ కాశపు ష్పమువలె, గంధర్వనగరమువలె, శశవిషాణమువలె, వంధ్యాసూనునివలె, పరిపూర్ణమందు లేకనేతోచెను.

సర్వదా యేకరీతిగా యుండునది అచల పరిపూర్ణ పరబ్రహ్మము. చలా చలములనే ద్వంద్వపద్ధతిగలది యెరుకయనీ పరిపూర్ణమందు లేనిదనీ అచల సిద్ధాంతముగనుక అచలసిద్ధాంతముయొక్క లక్ష్యమే వేరు. వేదాంతము యెక్కడ అంతమగునో అక్కడనుండి అచల పరిపూర్ణప్రబోధ ప్రారంభమ గును. కావుననే వేదములయందు ఉపనిషత్తులయందు మరియు శాస్త్ర ములయందు శోధించినను అచల పరిపూర్ణ పరబ్రహ్మము తెలియబడదు. ఇది కేవలము గురుగుహ్యము. నిజగురువులద్వార దీనిని తెలుసుకొన వీల గును. గురుముఖతః పరిపూర్ణ మెరుకలను తెలుసుకొని తెలిసిన తెలివిని విడిచియుండడమే జన్మరాహిత్యమునకు ఏకైక విధానమని శ్రీ రామడుగు శివరామ దీక్షిత అచల పరిపూర్ణ ప్రబోధసిద్ధాంతము.

# సంసారి (మాయలమారి)

సాధారణముగా మనోకల్పిత వ్యవహారమును సంసారమందురు. వేదాం తరీత్యా మనస్సు మాయగనుక సంసారముకూడ మాయ యని చెప్పుదురు "మనోహ్యవిద్యా" మనస్సు అవిద్యాలేక మాయ యని శ్రీ శంకరాచా ర్యులు వచించినారు. శృ|| చిత్తే చలతిసంసారః నిశ్చలేమోక్ష ఉచ్యతే యని శృతివాక్యము. శ్లో|| చిత్త మేవహి సంసారోరాగాది క్లేశదూషితం | తదే వతైర్వినిర్ముక్తం భవాంత ఇతికధ్యతే|| రాగాది క్లేశములచేత దూషితమగు చిత్త చలనమే సంసారమని రాగాదులనుండి ముక్తి జెందిన మనస్సు యొక్క నిశ్చల స్థితియే మోక్షమని పైన పేర్కొనబడిన శృతిస్మృతుల తాత్పర్యము.

మనస్సు మాయయైనను (అజ్ఞానావస్థయందు) బంధమోక్షములకు కార ణముగానున్నది. శ్లో|| మనస్వైవేంద్రజాల శ్రీజగతి ప్రవితన్యతే | యావదే తత్సంభవతి తావన్మోక్షోనవిద్యతే|| ఈ మనస్సుచేతనే ఇంద్రజాలమగు జగత్తు విస్తరింపబడినది గనుక మనస్సు యున్నంతవరకు మోక్షము సున్న. శ్లో|| మనస్వైవ మనశ్చిత్వాపాశం పరం బంధనం | భవాదుత్తరయాత్మానం నసావన్యేనతార్యతే||

శ్లో|| అసంకల్పనశస్త్రేన ఛిన్నం చిత్తమిదంతుదా సర్వం సర్వగతం శాంతం బ్రహ్మసంపద్యతేతదా|| మనోనాశనమువల్లనే మోక్షము సిద్ధించునని, సంక ల్పమే మనస్సుగనుక సంకల్ప రహితమే మనోరహితమని మనోరహితమే ఆత్మసాక్షాత్కారమని వేదాంత సిద్ధాంతము.

వేదాంత విచారణవల్ల జగత్తు సంసారమని యీ సంసారమునకు మూలము మనస్సని మనస్సే సంసారియని తెలియబడును. అచల సిద్ధాం

మందు అసలు సంసారి మనస్సు కాదు. మనస్సునకు యే చైతన్యము ఆధారముగాయుంటె మనస్సు సంకల్పించగలుగుచున్నదో అదియే సంసారి లేక యెరుక. మనోనాశనముచే యే బ్రహ్మాపొందబడునని వేదాంతము ప్రబోధించుచున్నదో ఆ బ్రహ్మమే యెరుకయని యెరుక రహితస్థితియే పరిపూర్ణపరబ్రహ్మయని శ్రీశివరామ దీక్షితీయ అచల సిద్ధాంతముగనుక అచలసిద్ధాంతము వేదాంతాతీతమని చెప్పబడును. కందార్ధము|| ఏ వస్తువుచేతను తానావిర్బవమొందు దేహమనుతరువరయన్ | అవస్తువె దానికి విత్తె వెలయును దాన్నె సాక్షిద్రష్టాని కనుమీ. యెరుక యిదే స్పష్టాము వినుమీ. యని శ్రీ భాగవతుల కృష్ణదేశికులు శుద్ధ నిర్గుణ తత్వకందార్ధ మందు వాక్రుచ్చినారు. "వినుమితరులు యెరుకను సాక్ష్యని పల్కిరి నేను సాక్షినహమని నీతో వినజెప్పితి నింతియె వేరనకూడను. రెంటి నొకటియని తెల్సుకోరా" యని మరియొక కందార్ధమందు తెలియజేసినారు. మనస్సు మరియు ధాని వ్యవహారమంతా మరుపురూపమని తెలియనగును. "ఎరుక అజడము (చేతనము) జడమీ జగము." "పరిపూర్ణ మేమి యనరానిది" సంకల్పాదికగుణముల సంకుల మీఎరుకయందు సమకూడి యుండు"ను గనుక యెరకయే సర్వమునకు స్రష్టా, ద్రష్టా, కర్తా, భోక్తా, ఈ యెరుక నిర్మూలనమువల్ల నే సంకల్పరహితమగునని తెలుసుకొనవలయును.

సంసారం

సంసారియని పదము 'సృ' ధాతువునుండి వ్యుత్పన్నమైనది. సం + సారి = సంసారి, సరి ఉపసర్గ సృ అనగా కదలుట. కదలునది సంసారియని అర్థము. ఆత్మనుండి (ఆత్మయొక్క కదలికచేతనే) ఆకాశాది పంచమహాభూతమ్ము లుద్భవించినవని, యివి పంచీకృతములైవీని చేయిరువది ఐదు యింద్రియములేర్పడినవని సాంఖ్యము తెలుపు చున్నది. ఆకాశపంచక మంత రేంద్రియములు ప్రాణాదులును వాయు పంచకంబు. జ్ఞానేంద్రియంబులు వైశ్వానర పంచక మప్పు పంచకము శబ్దాదులైదు. కర్మేంద్రియంబులు కడుభూమి పంచకంబిట్టు లిరువది అయదు యింద్రియములు. ఇవి ఆత్మగాదని నిన్నిటినెరిగేటి యెరుకయే పరమాత్మయని యెరింగి సాంఖ్యయోగంబు సాధించు సజ్జనుండుముక్తిజెందు"నని భద్రాద్రిరామశతకమునందు చెప్పబడినది. జ్ఞానము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములను అంతరేంద్రి యములలో మనస్సు యొకటి. ఇతర యింద్రియములవలెనే యిది కూడ ఆత్మకాదని జడమనీ తెలుసుకున్నతర్వాత జడమగు మనస్సు నకు స్వతః కదలిక లేదని వేరే చెప్పనక్కర లేదు."ఆత్మనః ఆకాశః సంభూతః" యను శ్రుతివాక్యము సర్వము ఆత్మనుండియే సృష్టి అయినదని తెలుపుచున్నది. పరమాత్మయే తన ఆనందముకొరకు స్వసంకల్పముచేత సర్వము సృష్టించెనని అన్ని మతము లంగీకరించు చున్నవి. సంకల్పమే కదలిక.

"ఎరుకైన భూతముల నీవెరుగుము. ఆకసము గాడ్పుయింగలము నీళ్లిరవందనేలయని నేనెరిగిన పద్ధతిని నీకు నెరిగించినాను. ముజ్జగముల య్యేను వీట్లతోను" యని మరియు "ఆకాశాధిక భూతా నీకాత్మకమగుచు యెరుక యీ జగమయ్యేన్ రాకడ పోకడ దీనికి ప్రాకటముగ దేనిలోనో బట్టబయలదిరా" యనిన్ని శ్రీ కృష్ణదేశికులు ఆయా కందార్థములలో విదితపరచినారు.

ఆత్మ (యెరుక) యీ రీతిగా అనేకమై అన్నిటియందు తాను ప్రస రించినది గనుక అసలు సంసారి ఆత్మయేయని అచలసిద్ధాంతము నొక్కి చెప్పుచున్నది. "అన్ని యుతానై తనకవి పన్నుగ వేరనుచు నోటబల్లుకుచు మరితానన్నిటినెరిగే నెరుకై యున్నానని యెరుకె యెరుకనూహింపుచుండు తనలోతాను మోహింపుచుండు"ను. ఈ యెరుక జీవరూపమున పిండాం డమందు యొకప్పుడు ఆటాడి మరి యొకప్పుడు ఆటాడకుండును. ఈ యెరుకే ఈశ్వరరూపమున బ్రహ్మాండమందు (ఆటాడిన మేనుబొమ్మ ఆటా డకనే) అహోరాత్రములనే నిర్ణయములేక ఆటాడుచుండును. జీవేశ్వరులకు ఆధారమైన అధిష్ఠాన బ్రహ్మయొక్క సత్తావల్లనే వీరలుభయులు ఆటాడు చుందురు. గనుక ఆటాడించువాడు అధిష్ఠానబ్రహ్మయని అతడే కర్తయని చేటుపాటుల రెంటిచేవచ్చు ఫలము ముమ్మాటికనుభవించి అతడే జనన మరణముల జెందునని అంతటికి అచలము అకర్తయని వేరె కందార్థమందు తెలియజేయబడినది. కావున బ్రహ్మమే సృష్టి స్థితిలయముల బొందుచుం డును. శ్లో|| సర్వభూతానికౌంతేయ ప్రకృతింయాంతి మామికాం, కల్పక్షయే పునస్తాని కల్పాదౌవిసృజామ్యహం|| భగవద్గీత 9-7

కల్పాంతమందు సర్వభూతములు తనయందు లయమవునని మరియు కల్పాదియందు వానిని తానుసృజింతునని శ్రీకృష్ణభగవానుడు భగవద్గీత యందు చెప్పినరీతిగా సృష్టియందుగలుగు ఆ విర్భావము ప్రళయమందు గలుగు తిరోభావములే ఆత్మకు రాకడ పోకడలు (జనన మరణములు) గలిగినదే ఘోర సంసారము. ఇటి ఘోర సంసారము యొక్క బాధల నెరిగి జన్మరాహిత్యమునకు మార్గమన్వేషించు జిజ్ఞాసువే అచల పరిపూర్ణ ప్రబోధ కర్హుడగును.

అసలు సంసారియగు యెరుక, పరిపూర్ణ మందు మృగజలము వలె స్వప్నానందమువలె లేకనే తో చుచున్నది. "పెట్టియ లోపలి గారడి చెట్టుప యిన్ గానవచ్చి చెట్టునజూడన్ గట్టుపై తోచునది కనుకట్టునుమీ దీనివలెనే కన్పించునెరుకా అంతలో నెచట కన్పించ దెరుక" యని కృష్ణదాసుగారు తెలిపినారు. ఉన్నదే పరిపూర్ణమని లేనిదే యెరుకయని వస్తునిశ్చయముగా

గురుముఖతః తెలుసుకొని తెలిసిన తెలివిని విడిచినచో అచ్చమగు సంసారి. మాయలమర్రి (యెరుక) కథ మాయమగును. అన్య మార్గముల చేత యెరుక నశించదు. యెరుక రాహిత్యముగానిదే జన్మరాహిత్యము గలుగదు. ఇది ముమ్మాటికి సత్యము. సత్యము. సత్యము. ఇదియే శ్రీశివరామ దీక్షితీయ అచల సిద్ధాంతము . . .

# జనన మరణములు

జనన మరణములు దేహధర్మములు కావున దేహమున్నంత వరకు చావు పుట్టుకలు తప్పవు. శ్లో|| జాతస్య హిధృవోమృత్యుః ధృవం జన్మమృతస్యచ| తస్మాద పరిహార్యే ఽర్థేనత్వం శోచితుమర్హసి

పుట్టునది గిట్టును గనుక మృత్యువును గురించి శోచింప దగదని భగవద్గీతయందలి పై శ్లోకముయొక్క తాత్పర్యము. అయితే మానవుడు యీ జనన మరణములవల్ల కలుగు బాధలు భరింపరానివై నందున ముక్తిని గోరుచుండును. కావున జన్మరాహిత్యమే మోక్షమని కర్మరాహిత్యమువల్ల జన్మరాహిత్యము సిద్ధించునని జ్ఞానమువల్ల జన్మలు నశించునని వేదాంత సిద్ధాంతము. కారణము లేనిదే కార్యముండదు గనుక పూర్వజన్మకును మరియు పునర్జన్మకును కర్మయే కారణమని చెప్పక తప్పదు.

ఇంతకు పూర్వము గతించిన జన్మలయొక్క కర్మసంచయము సంచితమని ప్రస్తుత జన్మలో అనుభవింపబడు సుఖదుఃఖములు ప్రారబ్ధమని మరియు యిప్పటి జన్మలో చేయబడు సుకృత దుష్కృతములు ఆగామి యని, యనబడును. ఈ భూత భవిష్యత్ వర్తమాన కర్మ విభాగమును బట్టి యింతక్రితం యెన్నియో జన్మలు గడచినవని విదితమగును. శ్లో|| బహూనిమేవ్యతీతాని జన్మానితవచార్జున తాన్యహం వేదసర్వాణినత్వంవేత్థ పరంతప|| భగ 4-5, హేఅర్జునా నాకును నీకును అనేక జన్మలు గడిచినవి. వాటిని నేనెరుగుదును. నీవెరుగవని శ్రీ కృష్ణుడు అర్జునునకి తెలిపినాడు. శ్రీకృష్ణపరమాత్మ గురుస్వరూపమున తన శిష్యుడగు అర్జునునకు పరతత్వము ప్రబోధించు చున్నాడు. గనుక శ్రీకృష్ణుడు సర్వజ్ఞుడును అర్జునుడు అల్పజ్ఞుడు అను విషయము సుస్పష్టము మరియు ప్రత్యగాత్మ పరమాత్మల యొక్క జన్మ పరంపరలు పై శ్లోకమువల్ల బోధపడగలవు.

జన్మకు పూర్వకర్మ కారణమని చెప్పబడినందున లోక కళ్యాణమునకై యవతరించు మహాపురుషులు తమ పూర్వకర్మలవల్ల జన్మించువారని భావించకూడదు. వారలు కేవలము లోక సంగ్రహార్థమై జన్మించువారు గనుక కారణజన్ములని చెప్పబడుదురు. వారలు కర్మబద్ధులుకారు. శ్లో|| యదా యదాహి ధర్మస్యగ్లానిర్భవతి భారత అభ్యుత్థాన మధర్మస్యతదాత్మానం

సృజామ్యహం|| భగ. 4-7

శ్లో|| పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం ధర్మ సంస్థా పనార్థాయ సంభవామి యుగే యుగే|| భగ. 4-8.

శ్లో|| నమేపార్థాఽస్తి కర్మవ్యం త్రిషులో కేషుకించన నాన వాప్తమవా ప్తవ్య వర్త ఏవచకర్మణి|| భగ. 3-22 ఇత్యాది శ్లోకములచేత కారణజన్ముల విశిష్టత తెలియనగును.

జనన మరణములు కేవలము స్థూలశరీరమునకే పరిమితములుకావు. ఒకే జన్మలో అంతర్జన్మలు మరియు నంతర్మృత్యువులు సంభవించుచుండును. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు ఉపనయన సంస్కారమువలన రెండవజన్మ కలుగునని చెప్పబడును. గనుకనే వీరలు ద్విజన్ములని వ్యవహరింపబడుదురు. ఉపనయన సందర్భమున గాయత్రి మంత్రము ద్వార యుపదేశింపబడు జ్ఞానప్రబోధయే ద్విజన్మత్వమునకు కారణమని తెలియనగును. ఇదే రీతిగా బ్రహ్మనిష్ఠగలవాడు చ్యుతుడై అనగా స్వస్వరూపస్థితినుండి దిగజారి పశు త్వాది గుణముల వశమై విషయ వాంఛలను వాంఛించడమే యతనికి మృత్యువని చెప్పబడును. శ్లో|| ప్రమాదో బ్రహ్మనిష్ఠాయాంనకర్తవ్యః కదాచన | ప్రమాదో మృత్యురిత్యాహ భగవాన్ బ్రహ్మణః స్మృతః|| వి.చూ.

జ్ఞానాజ్ఞాన సంజనితములగు నీ యంతర్జన్మలు అంతర్మృత్యువులు సూక్ష్మ శరీర సంబంధములు, స్థూలదేహ ధర్మములగు జనన మరణములకు నివియే కారణములని తెలుసుకొనవలయును.

స్వర్గాది సుఖములు కూడ ఆశాశ్వతములని వేదాంతము చాటి చెప్పచు న్నది. "క్షీణే పుణ్యే మర్త్యలోకే విశంతి" యను భగవద్గీతా వాక్యానుసారం పుణ్యము నశించిన వెంటనే జీవులు మర్త్యలోకమును జేరుదురు. పునరపి జననం పునరపి మరణం, పునరపి మరణం పునరపి జననం. ఇట్టి జనన మరణముల ఘోర సంబంధమునుండి ముక్తిమార్గమును సద్గురువులచేత తెలుసుకొనవలయును. మానవునకు జన్మతరుణోపాయమును తెలుసుకొను టకై పవిత్రమైన జ్ఞానము ప్రసాదింపబడుటవలన మరియు ప్రాణులకిట్టి జ్ఞానము లేకుండుట వలన యితర జన్మలకంటె మానవజన్మ శ్రేష్ఠమైన దను విషయము సర్వమత సమ్మతమైయున్నది. కాని మానవునకు తన ముక్తి మార్గమును తెలుసుకొను జిజ్ఞాస కలుగుటయే దుర్లభము. సద్గురువుల యొక్క ఆశ్రయము లభించడము అతి దుర్లభము.

శ్లో|| దుర్లభంత్రయమేవైత ద్దైవానుగ్రహ హేతుకం మనుష్య త్వం మముక్షుత్వం మహాపురుష సంశ్రయః వి.చూ.

జన్మ తరుణోపాయమును తెలియజేయు సద్గురువుల నాశ్రయించి జన్మకు కారణమగుదానిని వివేకముచేత తెలుసుకొనుటకు ప్రయత్నించెడి మానవుని జన్మ ఉత్కృష్టమైనది. అట్లు ప్రయత్నము చేయని మానవునిజన్మ యితర ప్రాణులకంటెను నికృష్టమైనదనే చెప్పవలయును. ఎందుకనగా యితర ప్రాణులు కేవలము తమప్రారబ్ధముననుభవించుటకే జన్మించినవి కాని మానవుడు తన ప్రారాబ్ధానుభవముతోపాటు అజ్ఞానముచేత కర్మను వృద్ధిచేసుకొనుచు తన పూర్వ సంచితమును పెంచుకొనును. కావున మానవుడై జన్మించినందులకు కర్మత్రయ నాశనము గావించుకొనుటకై సద్గురువులచే ఆత్మానాత్మల విచారము సల్పి పరమ పదమును కనుగొనవలయును.

ఆత్మయనగా జ్ఞానము. అనాత్మ యనగా అజ్ఞానము. జ్ఞానమనగా నేను లేక ఎరుక. అజ్ఞానమనగా మేను లేక మరుపు. జ్ఞానమనిన విజ్ఞానమనిన సుజ్ఞానమనిన ప్రజ్ఞానమనిన శుద్ధజ్ఞానమనిన దేహి యనిన ఎరుకకే మారు పేర్లు. అజ్ఞానమనిన విపరీత జ్ఞానమనిన మిధ్యాజ్ఞానమనిన దేహమనిన ఎరుక యొక్క పరిణామ స్వరూపమగు మరుపుకు మారు పేర్లు. ఇట్లు నేను యను జ్ఞానమే కర్మకు కారణమై జనన మరణములకు మూలమైయున్నది. కం|| నేనన్న నహమహంబన నేనుసుమీ అహమటంచు నేనెపుడంటె నేనపుడు పుట్టుటది జన నేను గతించుట మటంచు నీవెరుగయ్యా|| యనియును కం|| నేనుగాకొకటి శుద్ధజ్ఞానము గలదనుచు బల్కు జ్ఞానులమాటల్ పూని వినతగదు శుద్ధజ్ఞానంబన నేనే నేనులేనిది యౌనే|| యనిన్ని శ్రీభాగవత కృష్ణదేశికులు శుద్ధనిర్గుణతత్వ కందపద్యములయందు తెలిపినారు.

"సత్వాత్ సంజాయతేజ్ఞానం" సత్వగుణములవల్ల జ్ఞానము పుట్టునని గీతావచనము. పుట్టునది గిట్టును. మళ్లిపుట్టును. పుట్టని చావనిది యొక్కపరిపూర్ణ పరబ్రహ్మము. జ్ఞానాతీతమగు పరిపూర్ణ పరబ్రహ్మమును కనుకొనననంతవరకు జ్ఞానము (ఎరుక) పుట్టుచు చచ్చుచుండునని శ్రీకృష్ణదాసుగారి క్రింద పద్యము సూచించును. కం|| జ్ఞానమునేననన్నొక్కటె జ్ఞానమునే వేరటంచు గనబోకుసుమీ! జ్ఞానము వచ్చును బోవును జ్ఞానాతీతమును తాను గాంచినదాకన్.

జ్ఞానమున కన్యమైన అచల పరిపూర్ణ పరబ్రహ్మమును పరిపూర్ణ గురువులచేత కనుగొని పరిపూర్ణమందు నేను లేనంచు చనుటయే జన్మరాహిత్యమని అమృతత్వమని శ్రీ శివరామదీక్షితీయ అచల సిద్ధాంతము. ఇదియే నిజమగు సాంప్రదాయము.

లోక కళ్యాణమునకై కర్మాచరణ గావించువారి జన్మయే జన్మయని అమృతత్వమును సిద్ధింపజేయు మృత్యువే మృత్యువని తెలుసుకొనుటయే జనన మరణ విచారమునకు ఫలము.

# "బుద్ధిః కర్మానుసారిణి"

"బుద్ధిః కర్మానుసారిణి" అను సంస్కృత భాషయందలి లోకోక్తి సామాన్యముగా యితర భారతీయ భాషలయందును యుపయోగింపబడును. వారి వారి కర్మల ననుసరించి బుద్ధి పరిణామము జెందుచుండునని యీ లోకోక్తి యొక్క భావము. " వినాశకాలే విపరీతబుద్ధి" యను లోకోక్తికూడ యీ భావమునే వ్యక్త పరుచుచున్నది. ఆత్మోన్నతికి కాని ఆత్మ వినాశనమునకు కాని బుద్ధియే కారణమని తెలియనగును.

శ్లో|| ధ్యాయతో విషయాన్పుంసః సంగస్తే 'షా' పజాయతే
సంగాత్సంజాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే

శ్లో|| క్రోధాద్భవతి సమ్మోహ స్సమోహాత్స్మృతి విభ్రమః
స్మృతి భ్రంశాద్బుద్ధి నాశోబుద్ధి నాశాత్ప్రణశ్యతి||
భగవద్గీత 2 = 62, 63

విషయాదుల చింతనజేయు పురుషునికి విషయములందు ప్రీతి, ప్రీతి వలన కోరిక (ఆశ) కోరికవల్ల క్రోధము, క్రోధమువలన సమ్మోహము. దానివలన స్మృతినాశము, స్మృతి నాశమువలన బుద్ధినాశము, బుద్ధి నాశము వలన నతడు పురుషార్థహీనుడై సర్వనాశనమును బొందునని భగవద్గీత యందలి పై శ్లోకములలో శ్రీకృష్ణ భగవానుడు అర్జునునకు తెలిపినాడు.

సంసార సాగరమును తరించుటకై యుపయుక్తమగు మానవుని జీవిత నౌకకు బుద్ధి చుక్కానివంటిది. సత్కార్మాచరణముద్వార మానవుడు తన బుద్ధిని మార్గదర్శినిగా చేసుకొనవచ్చును. దుష్కర్మాచరణముగల మానవుని బుద్ధి దుష్కర్మలనే ప్రేరేపించు చుండును. వారివారి కర్మల ననుసరించి వారి వారి బుద్ధి పనిచేయుచుండును. గనుకనే బుద్ధిః కర్మానుసారణీ యని చెప్పబడినది.

సత్వగుణ ప్రధానమైనపుడు సాత్విక బుద్ధియని, రజోగుణ ప్రధానమైనపుడు రాజస బుద్ధియని, తమోగుణ ప్రధానమైనపుడు తామసిక బుద్ధియని బుద్ధి త్రివిధరూపము.

శ్లో|| ప్రవృత్తించ నివృత్తించ కార్యాకార్యే భయాభయే
బంధం మోక్షంచ యావేత్తి బుద్ధిస్సాపార్థ సాత్వికీ || భగ.18-30.

కర్మ మార్గమును సన్యాసమార్గమును కార్యా కార్యములను భయాభయములను బంధ మోక్షములను తెలుసుకొను బుద్ధి సత్వగుణ ప్రధానమైనది.

శ్లో|| యయాధర్మ మధర్మంచ కార్యంచా కార్యమేవచ
అయధావత్ప్రజానాతి బుద్ధిస్సాపార్థ రాజసీ||భగ. 18-31

శాస్త్ర సమ్మతమైన ధర్మమును శాస్త్ర నిషిద్ధమైన అధర్మమును కార్యమును, అకార్యమును అనగా చేయతగిన దానిని చేయుతగనిదానిని యదార్థరూపముతోగాక సందేహాస్పదముగా యే బుద్ధి తెలుసుకొనుచున్నదో అది రాజసబుద్ధి యనబడును.

శ్లో|| అధర్మం ధర్మమితియామన్యతే తమసావృతా
సర్వార్థాన్విపరీతాంశ్చ బుద్ధిస్సాపార్థ తామసీ||భగ. 18-32

అజ్ఞానముచేత శాస్త్ర నిషిద్ధమైన అధర్మమును శాస్త్రోక్త ధర్మముగాను మరియు తెలియదగు సకల వస్తువులను విపరీతములుగాను తెలుసుకొనునట్టి బుద్ధి తామసిక బుద్ధియని యనబడును.

మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారమను అంతఃకరణ చతుచతుష్టయములో మనస్సు సంకల్పించి వికల్పించునట్టిది. బుద్ధి నిశ్చయించునది. మరియు గుర్తుకు తెచ్చునది. చిత్తము చింతన చేయునది. అహంకారము అభిమానము జెందునది.

బుద్ధి నిశ్చయించిన తర్వాతనే కర్మేంద్రియములు క్రియోన్ముఖములగును. కావున అంతఃకరణ చతుష్టయములో బుద్ధియే ప్రధానమైనది. అహమత్వమమత్వములు (నేను నాది యనునవి) బుద్ధి పరిణామమగు అహంకారము యొక్క వ్యవహారములే. ఈ అహమత్వమమత్వములే బంధ హేతునులు కావున బందవిముక్తి కొరకు ఆత్మతత్వము లేక పరతత్వమును తెలుసుకోవలసినచో యింద్రియ నిగ్రహముచే శుద్ధబుద్ధి గలిగియుండుట యవసరము. యింద్రియ నిగ్రహమనగా విషయగ్రాహక సర్వేంద్రియ నిగ్రహమని గ్రహించవలయును. ఎందుకనగా యే యొక యింద్రియముకూడ శబ్ద స్పర్శాది విషయ చింతనయందు తగులు కొనునేని దానివలన బుద్ధి నాశము తప్పదు. కుండ యడుగు భాగమున యొక రంధ్రము మాత్రము పడిదానిలోని జలము కారుటకు ప్రారంభించునేని జలమంతయు కారిపోవునటుల యే యొక్క విషయాసక్తిచే నైనను మానవుని ప్రజ్ఞ (బుద్ధి) నశించిపోవును.

శ్లో|| ఇంద్రియాణాంతు సర్వేషాంయద్యేకక్షర తీంద్రియం
తేనాస్య క్షరతి ప్రజ్ఞాదృతేః పాదాదివోదకం||
మనుస్మృతి అధ్యా 2 = 99

భగవద్గీతయందు శ్రీకృష్ణుడు అర్జునకు మొదట సాంఖ్యమునే ప్రబోధించినాడు. సాంఖ్యమనగా సంఖ్యా సంబంధమైనదని కూడ ఒక యర్థము. గాన ఇరవైనాలు గింద్రియముల కతీతమైన యిరవై అయిదవ తత్వమగు ఆత్మతత్వము నుపదేశించునది సాంఖ్యము. సాంఖ్య శబ్దమునకు జ్ఞానము బుద్ధి యనికూడ అర్థము కలదు. కావున సాంఖ్య యోగమనబడు రెండవ అధ్యాయమందలి (38) శ్లోకము వరకు చెప్పబడినది. సాంఖ్యయోగమని ఆ తర్వాత శ్లోకములలో చెప్పబడిన ఆత్మతత్వము "బుద్ధియోగ" మని ప్రత్యేకించి చెప్పబడినది.

శ్లో|| ఏషాతేஉభిహితా సాంఖ్యేబుద్ధిర్యోగేత్విమాంశ్రుణు
బుద్ధ్యాయుక్తో యయాపార్థ కర్మబంధం ప్రహాస్యసి భగ. 2-39

ఓ అర్జునా తత్వజ్ఞానము కొరకు యే బుద్ధి చెప్పతగునో యే బుద్ధితో కూడినవాడవై కర్మబంధమును వీడుదువో దానిని నీకు తెలిపెదను వినుమని శ్రీకృష్ణుడు చెప్పిన వాక్యములు నిచట గమనింపతగినవి.

శ్లో|| వ్యవసాయాత్మికాబుద్ధి రేకేహ కురునందన
బహుశాఖాహ్యనన్తాశ్చ బుద్ధయో వ్యవసాయినాం || భగ. 2-41

ఆత్మతత్వమును తెలుసుకొనుటకు వ్యవసాయాత్మికమగు బుద్ధి అనగా యుక్తబుద్ధి లేక పరిశుద్ధ బుద్ధియొక్కటే సహాయకారిగా నుండి యేకరీతిగా నుండును. అవ్యవసాయాత్మికమగు బుద్ధి అనేక శాఖలుగా పరిణమించు చుండునని పై శ్లోకముయొక్క తాత్పర్యము.

శ్లో|| ప్రసాదేసర్వ దుఃఖానాం హానిరస్యోపజాయతే
ప్రసన్న చేతసోహ్యాశుబుద్ధిః పర్యవతిష్ఠతి|| భగ. 2-65

నిర్మల చిత్తముచేత సర్వదుఃఖములు నశించును, బుద్ధి స్థిర మగునని భావార్థము.

శ్లో|| నాస్తిబుద్ధిరయుక్తస్య నచాయుక్త స్యభావనా
నచాభావయతశ్శాన్తి రశాన్తస్య కుతస్సుఖం భగ, 2-66

మరియు చిత్తశుద్ధి లేనివారికి స్థిరబుద్ధి గలుగదు. స్థిరబుద్ధి లేనివారికి భక్తి భావములు గలుగవు. భక్తి భావాలు లేనివారికి శాంతిలేదు. శాంతి లేకున్న సుఖము లేదు.

శ్లో|| ఇంద్రియాణాం హిచరతాం యన్మనో ऽనువిధీయతే
తదస్యహరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి భగ. 2-37

ఇంద్రియ విషయముల వెంబడి యెవని మనస్సు చరించుచుండునో వాని ప్రజ్ఞను (బుద్ధి) జలములోనున్న యోడను వాయువు హరించురీతి నాశనముచేయును.

శ్లో|| తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః
యింద్రియాణీంద్రియార్థే భ్యోస్తస్య ప్రజ్ఞాప్రతిష్ఠితా||

కావున యెవని యింద్రియములు విషయములనుండి నిగ్రహింప బడినవో వాడు స్థిరబుద్ధి గలవాడని (స్థితప్రజ్ఞుడని) చెప్పబడును.

ఇంద్రియములను విషయములనుండి నిరోధించడము కష్టసాధ్యమే. అయినను జ్ఞానప్రబోధచేత యింద్రియముల విషయాసక్తిని క్రమశః తగ్గించవచ్చును. ఇంద్రియములకు విషయములు ఆహారములు, విషయానుభవముచే యింద్రియములకు శాశ్వత తృప్తి కలుగనేరదు సరికదా విషయ భోగము వలన మరి మరి విషయాసక్తి పెరుగుచునే యుండును. కాని తగ్గదు. కావున విషయ భోగములు క్షణికములని ఆదిలో నవి సుఖప్రదములుగా కన్పించినను అంత్యములో దుఃఖదాయకములేయని తెలుసుకొని నిస్పృహ జెందిన మానవునికి విషయాసక్తి నశించును. బుద్ధి పరిశుద్ధమగును. పరిశుద్ధమగు బుద్ధి గుహయందే సదసద్విలక్షణమును పరమార్థ సత్యమును అద్వితీయమునైన బ్రహ్మము గలదని వేదాంత నిర్ణయము.

శ్లో|| బుద్ధౌగుహాయాం సదసద్విలక్షణం
బ్రహ్మాస్తి సత్యం పరమ ద్వితీయం
దదాత్మనాయో త్ర వసేద్గుహాయాం
పునర్నతస్యాంగ గుహాప్రవేశః వి.చూ.

అయితే శ్రీకృష్ణదేశిక ప్రభువులు రచించిన శుద్ధ నిర్గుణ తత్వ కందార్థములలో "అనుమానము మదినుంచక వినుమింకను యెరుక పేర్లు వివరించెద; బుద్ధ్యన చిత్తంబన మానసమనిన అహంకారమనిన" యను కందార్థమందు బుద్ధి యెరుకయని వివరించబడినది. దీని కతీతమైనదే పరిపూర్ణ పరబ్రహ్మము యనియు యిరవై ఆరవ తత్వమనియు అచల సిద్ధాంత గ్రంథములందు పేర్కొనబడినది. చెవియొగ్గి వినవలసిన మరియొక కందార్థమందు శ్రీకృష్ణదాసుగారు యీరీతిగా సెలవిచ్చినారు.

కందార్థము :- తనువో బహిరింద్రియములో మనసో ప్రాణములో విష యమమతో నేనంచని నీవని యననిదియని యనుమానించెదవదేల అది త్రోవగాదు నీ వెన్నాడు యిది వినలేదు. వినుమా పరిపూర్ణముగని లేని యా మీది తనువాదికమును లేందని గురునిచే తెలియుమది త్రోవగాదు నీ వెన్నాడు యిది వినలేదు.

పై వివరణవల్ల వేదాంతమునకును అచల సిద్ధాంతమునకును గల సంబంధము విదితము కాగలదు. (అచల సిద్ధాంత ప్రచారము "రాజయోగి" పత్రికయొక్క ముఖ్యోద్దేశము. కాని పత్రికాముఖమున సాంప్రదాయక విషయములను వివరించతగినంత వరకే వివరించబడుచుండును. విశేష వివరణ తెలుసుకొనగోరువారు పరిపూర్ణ భావజ్ఞులగు నిజగురువుల నాశ్రయించి సవినయముగా అర్థించి తెలుసుకొనవలయును.)

# పిండబ్రహ్మాండంబులు

కందార్థము:- పిండబ్రహ్మాండంబులు రెండును యారెంటిలోని రెండహములు యీ ఖండములు నాల్గుగూడి యఖండంబగు ఎరుకరూపు గనరా మాతండ్రీ ఇది దెల్పినా ఘనుడే తలిదండ్రి" యని

శ్రీ భాగవతకృష్ణదేశికులు రచించిన శుద్ధనిర్గుణతత్వ కందార్థమందు తెలియజేసినారు. అఖండ ఎరుక యననేమో ఇందుకనబరచ బడినది. మఱియు యీఅఖండ ఎరుకను తెలియజేసెడివాడు ఘనుడని అతడే తలిదండ్రియని వర్ణింపబడినది. ఎరుక కతీతమైనదే పరిపూర్ణమని అచల సిద్ధాంతము గనుక పరిపూర్ణమును దర్శింపజేయువానిని తలిదండ్రియనవలనేకాని ఎరుక నిర్ణయము చేయువాడు ఘనుడెట్లగును? అతనిని తలిదండ్రిగానెట్లు భావించనగును? ఎరుకయనగా చేతనము. అఖండ చేతనమును గుఱించి వేదాంతము తెలియజేయుటలేదా? వేదాంతము నందు అఖండ చేతనము యొక్క వివరము తెలియజేయబడి యుండినచో వేదాంతమునకును అచల సిద్ధాంతమునకునూ గల భేదమేమి?

జీవబ్రహ్మైక్యమే మోక్షమని ఇదియే అద్వితీయబ్రహ్మయని అఖండ చేతనమని అద్వైతనిర్ణయము. జీవశివులు కల్పితనామములని వీటికిగల కించజ్ఞత్వ సర్వజ్ఞత్వ భేదములుకూడ యుపాధులవల్ల నేర్పడినట్టివేకాని వాస్తవికమైనవి కావని ప్రబోధముయొక్క సౌలభ్యము కొఱకేనని కల్పింప బడినవని, జహదజహల్లక్షణముచే అనగా భాగత్యాగ లక్షణముచే, జీవేశ్వరులకు గల

దేశ, కాల, భేదాది విరుద్ధాంశముల విడచి, లక్ష్యార్థమును గ్రహించుటచేత జీవేశ్వరుల ఐక్యము సిద్ధించునని అదియే అఖండ చేతనమని అధిష్ఠానమని స్వప్రకాశమని వేదాంతము ప్రబోధించుచున్నది.

శ్లో|| జ్ఞాతృజ్ఞేయ జ్ఞాన శూన్యమనంతం నిర్వికల్పకం
కేవలాఖండ చిన్మాత్రం పరం తత్త్వం విదుర్బుధాః||వి. చూ ||

శ్లో|| ద్రవ్యం కాలంచ చిన్మాత్రం జ్ఞానం జ్ఞేయంచిదే వహి
జ్ఞాతాచిన్మాత్ర రూపశ్చ సర్వం చిన్మయమే వహి|| తే. బిం. ఉ||

వేదాంతమందు తత్త్వమస్యాది మహావాక్యములచేత యీ అఖండ చేతనముయొక్క స్వరూపము నిర్ణయించబడినది. "తత్త్వమసి" యను మహావాక్యములో తత్ అనగా అది, త్వం అనగా నీవు, అసి యనగా ఐతివి లేక అయివున్నావని అర్థము. తత్పద వాచ్యార్థము ఈశ్వరస్వరూపము. లక్ష్యార్థము పరమాత్మ స్వరూపము. త్వం పద వాచ్యార్థము జీవస్వరూపము, లక్ష్యార్థము ప్రత్యగాత్మ స్వరూపము. అసియనగా జీవేశ్వరైక్యములేక ప్రత్యగాత్మా పరమాత్మలకైక్యము.

ఈశ్వరునకు మహత్తు మొదలు స్థూల దేహపర్యంతము కారణరూపమైన "మాయ" యుపాధి. జీవునకు కార్యరూపములును అవిద్యాకల్పితములునగు "పంచకోశములు" యుపాధి. మాయ మఱియు అవిద్యాకల్పితమగు యీ రెండు యుపాధులను లేవనియే తెలియనగును.

శ్లో|| తయోర్విరోధో ఽయముపాధికల్పితో
నవాస్తవః కశ్చిదుపాధిరేషః
ఈశస్యమాయా మహదాది కారణం
జీవస్య కార్యం శృణు పంచకోశాః || వి.చూ.||

ఇట్లు జీవేశ్వరుల అయిక్యమే అఖండచేతనిమని అఖండచేతనమే బ్రహ్మతత్త్వమని ఆబ్రహ్మతత్త్వమే నీవని తత్త్వమసి మహావాక్యముయొక్క తాత్పర్యము.

శ్లో|| ఏకమేవసదనేక కారణం! కారణాంతరనిరాస కారణం!
కార్యకారణ విలక్షణం స్వయం! బ్రహ్మతత్త్వమసిభావ
యాత్మని || వి. చూ.||

ఈఅఖండచేతనమును ఏకమేవాద్వితీయం బ్రహ్మయని; సర్వం ఖల్విదం బ్రహ్మయని; నేహనానాస్తి కించనయని; చైతన్యం శాశ్వితంయని ఎన్నోరీతుల శ్రుతిస్మృతులు వర్ణించినవి.

వేదాంతమునందు ప్రబోధించబడిన అఖండచేతనమునకును పై కందార్థములో శ్రీకృష్ణదేశికులు తెలియజేసిన అఖండ ఎరుకకును గల భేదమును పరిశీలించుదాం. పిండబ్రహ్మాండంబులను యీరెంటి యొక్క వ్యష్టి సమిష్టి సంఘాతములను త్యజించి అధిష్ఠానరూపము స్వప్రకాశమునగు పరబ్రహ్మమును తెలిసికొను బ్రహ్మానుభూతిని బొందవలసినదని వేదాంత ముపదేశించుచున్నది.

శ్లో॥ స్వప్రకాశమధిష్ఠాన! స్వయం భూయసదాత్మని!
బ్రహ్మాండమపి పిండాడం! త్యజ్యతాం మలభాండవత్॥ వి.చూ॥

పిండబ్రహ్మాండములను త్యజించిన తర్వాత వాటి అభిమానులగు జీవశివుల రెంటియైక్యతయే అఖండచేతనమని వేదాంతము నిశ్చయించగా పైకందార్థమందు పిండబ్రహ్మాండంబులు రెండును యీరెంటిలోని రెండహములు యీ ఖండములు నాల్గుగూడె అఖండంబగు ఎరుక రూపమని నిరూపించబడినది.

పిండబ్రహ్మాండంబులు స్థూలరూపములు. వాటి యహములు సూక్ష్మరూపములు. స్థూలరూపము మఱుపు. సూక్ష్మరూపము ఎరుక, ఎరుకను విడచి మరుపుకాని మరుపును విడచి ఎరుకగాని యుండుటకు వీలులేదు. కనుక యీరెంటికిగల అవినాభావ సంబంధమును బట్టి ఎరుకమరుపులు రెండునొకటేయని అచల సిద్ధాంత నిర్ణయము కావున పిండబ్రహ్మాండంబులు రెండునూ యీ రెంటిలోని రెండహములూ, యీ నాల్గుగూడె అఖండమగు ఎరుక రూపమేర్పడెందని పై కందార్థము విశదీకరించుచున్నది.

కట్టెయందున్న యగ్ని సామాన్యమైన యగ్నిగాను, మఱియు అగ్ని ముట్టుకొన్న పిదప విశేషమైనదిగానూ, కనబడిననూ రెండుస్థితులయందుగల యగ్నియొకటేయని తెలియబడురీతిగా ఈ చైతన్యము సామాన్య చైతన్యమని విశేష చైతన్యమని ద్వివిధరీతుల తోచబడిననూ స్వభావతః చైతన్యమొకటేయని గ్రహించవలయును.

ఈ అఖండచైతన్యమందు అస్తిభాతిప్రియము [సత్తుచిత్తు ఆనందము] స్వరూపంగా గల సచ్చిదానందబ్రహ్మము సత్యమని నామరూపక్రియాత్మకమగు దృశ్యజగత్తు మిథ్యయని వేదాంతము నిర్ణయించుచున్నది. ఒకే అఖండచేతనమందు కొంత సత్యము కొంత మిథ్యయను భావము సరికాదని ఎరుకమరుపులుగా నేర్పడిన యీ రెండును మిథ్యా స్వరూపములేయని సచ్చిదానంద రహితమే పరిపూర్ణమని పరిపూర్ణమందునవి మృగజలమువలె శశవిషాణమువలె ఆకాశకుసుమమువలె స్వప్నానందమువలె లేకనే తోచుచున్నవని, ఇది మొత్తము కలయని అచల సిద్ధాంత నిర్ణయము. గనుక ఈయఖండచేతనమే దండిదనెటివారు మెలుకువకలవారు కారని కల స్వరూపులని పై కందార్థము యొక్క చివరి భాగమున "ఖండాఖండములుగ

గనిపించె ఎరుకాను దండిదనెటి యుద్ధం దూలకలనైన గనరామాతండ్రీ"
యని శ్రీ కృష్ణదేశికులవారు వ్యక్తపరచినారు. చూపులలోగల వస్తువు
[ద్రష్ట] చూపులుగను వస్తువులును [దృశ్యం] చూపులుగూడన్ [దృక్]
తేపకు ఎరుకని తెలియుమని మరొక కందార్థమందు సెలవిచ్చియున్నారు.

అఖండచేతనము యొక్క ప్రాగర్ధము అనగా మొదటి యర్థము బ్రహ్మాం
డము తదభిమాని ఈశ్వరుడు. చరమార్ధము అనగా కడపటియర్ధము
పిండాండము తదభిమాని జీవుడు. ప్రాగర్ధచరమార్ధ యోగములకు సంయో
గము గావించి నే రచించిన దంతసాంగోపాంగముగా దయతో వినుడని
శ్రీ కృష్ణదేశికులాదిలోనె వేరొక కందార్ధమందు గ్రంధనిర్మిత విధానమును
తెలియబరచి, మరుపన తొలిమేనులు మూడు, అనగాస్థూలసూక్ష్మకారణ
శరీరములు; ఎరుకన నాల్గవ శరీరము అనగా మహాకారణశరీరము. ఈ
రెండొకటే పరిపూర్ణమవలిది. ఈవలియెరుకను గురువాక్కుచేత నెగు
రజిమ్మిన పోవును. లేని దెరిగే దేగినను, ఎరిగేదే లేకుండు, ననెడి
కందార్ధమందు ఎరుక మరుపులుగానున్న యఖండ ఎరుక అవిభాజ్యమైనదని
దని కతీతమైనదే పరిపూర్ణమని వివరించబడినది.

కం|| ఎరుకన మరుపన రానిది పరిపూర్ణం, భీశ్వరుడనబడునెరుక,
ఎరుక మరచిన జీవుండననబడు, ఎరుక అచలము నెరుగనరుగు
ఎరుకమరుపులున్|| మఱియు కం|| నీవెసుమీ జీవశివులు
నీవెసుమీ మేనుజగము-నీవెసుమ్మీ జీవశివైక్యము-బయలున నీవు గలుగలేదు.
లేదు నీమొదటలెచటన్ అను కందపద్యములలో కూడ ఎరుకమరుపుల
కతీతమైనది బయలని [పరిపూర్ణమని] విదిత పరచబడినది.

ఇట్లు అఖండచేతనము, సచ్చిదానందబ్రహ్మమని వేదాంతము స్థిరపరచు
చుండగా ఇదిలేని ఎరుకయని అచల సిద్ధాంతము సిద్ధాంతీకరించు చున్నది.
కావున అఖండచేతనము ఎరుకయే కాని పరిపూర్ణ పరబ్రహ్మముగాదని
దినికతీతమైనదే పరిపూర్ణ పరబ్రహ్మమని తెలిపెడివాడు ఘనుడేమరి.
అతడే తలిదండ్రి. ఇందుకు సందియములేదు.

కందార్థము:-

ఎరుగ ననేటిది ఎరుకే, ఎరుగుదునని తనను పరులనెరిగేదెరుకే!
ఎరుగ-నెరుంగుదు నను దాన్నెరుగుచు నుండేటిదెరుకే
నిరుపామబుద్ధీ, నీవెరుగిది నిగమాప్రసిద్ధీ
గురుమంత్ర మనియేటి గృద్దాలితోటి-యీఎరుక కూకుదువేరు
నెరిగీత్రవ్వి తెచాలు-నిరుపామబుద్ధీ-నీ వెరుగిదినిగమాప్రసిద్ధీ||

# ఏ సాధన నీకెందుకు?

కందార్థము|| ఏసాధన నీకెందుకు వీసానికి పనికిరాదు వినుమాయయ్యా
నేసాధులచే విన్నది యేసాధనలేనిబోధ వెరిగింతుపోకు; సాధనలందు మరిగితేరాకు; యేసాధనలజోలియే నొల్లనని నీవు బాసజేసితివేని పరి పూర్ణబోధ నేనెరిగింతుపోకు; సాధనలందు మరిగితెరాకు.

శ్రీ భాగవత కృష్ణ దేశికులు రచించిన శుద్ధ నిర్గుణ తత్వ కందార్థములలోని పై కందార్థమందు పరిపూర్ణబోధకు సాధనలు పనికిరావని సాధనలజోలికి పోనని బాసజేసిన యెడల పరిపూర్ణబోధ నెరిగింతునని పూర్ణగురువు శిష్యునికి తెలియజేసినాడు. సాధనసంపత్తియు గల సాధకుడైన యొక శిష్యుడు జనన మరణ ప్రవాహరూపమైన ఘోర సంసారమున బాధపడలేక తన పూర్వ పుణ్యోదయమున పుణ్య పురుషుడగు నొక గురు నిగాంచి సాధించదగు ముఖ్య సాధనను బోధజేయుమని వేరొక కందార్థమున శిష్యుడడిగిన ప్రశ్నకు పై కందార్థములో యే సాధన నీకెందుకు వీసానికి పనికిరాదని యుత్తరము చెప్పబడినది.

చిత్తశుద్ధిలేని జిజ్ఞాసువు తత్వవిచారణ కధికారి కానేరదు-కనుక చిత్తశుద్ధి కారణమగు సాధన చతుష్టయ సంపత్తిగలవాడే వేదాంత ప్రబోధ కధికారి కాగలడు.

సాధన చతుష్టయ సంపత్తి యనగానేమి? (1) నిత్యానిత్యా వస్తువివేకము (2) యిహాముత్ర ఫలభోగ విరాగము (3) శమాదిషట్కసంపత్తి (4) ముముక్షత్వము, అనునవి గల్గియున్నవాడే సాధన చుతష్టయ సంపత్తిగలవాడు. "బ్రహ్మసత్యం జగన్మిథ్యా" అనుభావము నిత్యా నిత్య వస్తువివేకమనబడును. అనిత్యములగు దేహాదులకు యిహపరముల యందు సుఖము కావలెనని ఆసించకుండుటయే యిహాముత్ర ఫలభోగ విరాగము (1) శమము (2) దమము (3) ఉపరతి (4) తితిక్ష (5) శ్రద్ధ (6) సమాధానము అను యీ ఆరున్నూ కల్గియుండుట శమాదిషట్క సంపత్తి. అజ్ఞాన కల్పితములగు బంధములందు చిక్కుకొనిన వానికి, తద్బంధముక్తికై కలిగెడి తీవ్రమైన యిచ్ఛముముక్షత్వమనబడును. ఈ చతుస్సాధనలుగలవాడు వేదాంత శ్రవణాధికారి ఐతే యీపై కందార్థములో సాధన చతుష్టయ సంపత్తి అనకుండా సాధన సంపత్తి అని మాత్రము చెప్పినారు. సంపత్తి యను మాటకు జయము అని అర్థము. కనుక సాధన సంపత్తియుగల సాధకుడనగా సాధనల యందు జయము పొందినవాడు అని అర్థము. సాధన యనగా శ్రవణమననిధిధ్యాసలతో గూడిన జ్ఞానసాధనగాని, అష్టాంగ సంయుతమగు యోగసాధనగాని

కావచ్చును. ఐతే శ్లో|| అర్థస్య నిశ్చయో దృష్టోవిచారేణ హితోక్తితః| నస్నానేన, నదానేన ప్రాణాయామ శతేనవా|| యని వివేకచూడామణి యందు శ్రీ శంకరాచార్యులు వచించినట్లు పుణ్యనదులస్నానమువల్లగాని దానజప తపము మున్నగు కర్మలవల్లగాని, ప్రాణాయామము వల్లగాని ఆత్మజ్ఞానము కలుగనేరదు. కేవలము తత్వ విచారము గురుకృపా విశేషమువల్లనే నిది సిద్ధించును. "జ్ఞానేనైవతుకైవల్యం" యను శృతి వాక్యము మరియు శ్లో|| కర్మణాబద్యతే జంతుర్విద్యయాచ విముచ్యతే తస్మాత్ కర్మనకుర్వంతి యతయఃపారదర్శినః యను స్మృతి వాక్యము లిందుకు ప్రమాణములు.

శ్లో|| శ్రేయాన్ ద్రవ్యమయాత్ యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరన్తప
సర్వంకర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే || భగ|| 4/33

శ్లో|| నహిజ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే
తత్స్వయంయోగ సంసిద్ధః కాలేనాత్మని విందతి ||భగ|| 4/38

ద్రవ్యములతో చేయబడు యజ్ఞములకంటె జ్ఞానమే శ్రేష్ఠమైనదని సర్వ కర్మలు జ్ఞానమందే పరిసమాప్తము జెందునని, యీ ప్రపంచమందు జ్ఞానమునకు సమానమైనది పవిత్రమైనది మరియొకటి లేదనిన్ని జ్ఞానముచేత స్వయముగా కాలక్రమేణ యోగసిద్ధుడు కాగలడనిన్ని పై శ్లోకముల తాత్పర్యము.

అయితే కర్మ సన్యాసముకంటె కర్మయోగమే శ్రేష్ఠమైనదని భగద్గీతల యందలి క్రింది శ్లోకమువల్ల తెలియునగును.

శ్లో|| సన్యాసః|| కర్మయోగశ్చనిశ్రేయసకరావుభౌ
తయోస్తు కర్మ సన్యాసాత్ కర్మయోగోవిశిష్యతే ||భగ|| 5/2

గీతోపదేశానంతరం అర్జునుడు యుద్ధమునకు సంసిద్ధుడు కావడముకూడ భగవద్గీతోపదిష్ట నిష్కామకర్మయోగమే యుపదేశసారాంశమని నిరూపించుచున్నది. ఈ రీతిగా కర్మజ్ఞానములు రెండును యొకటితో నొకటి ముడిబడియున్నవి గనుకనే భగవద్గీతయందలి జ్ఞానయోగమనబడు సాంఖ్యయోగము మరియు కర్మయోగము రెండు నొకటేయని నొకే ఫలమిచ్చునవనిన్ని భగవద్గీతయందలి క్రింది శ్లోకములో స్పష్టము చేయబడినది.

శ్లో|| సాంఖ్యయోగౌపృథగ్బాలాః ప్రవదన్తి నపండితాః
ఏకమప్యాస్థిత స్థితః సమ్యగుభయోర్విన్ద తేఫలం ||భగ|| 5/4

కనుక సాధనసంపత్తి యనగా - జ్ఞానసాధనయో లేక యోగసాధనయో జేసి, అందు జయం సాధించినప్పటికి, ఘోర సంసారబాధ తప్పలేదని గుర్తించి మహాభయము నొందుచుండు, పూర్ణాధికారి, గురుని శరణుజొచ్చి, మాబోంట్లకు యికముందు చేయతగిన ముఖ్యసాధనను బోధించుమని కోరగా అట్టివానికి కరుణామయుడగు గురుడు యీ కందార్థము నందలి విషయమును జెప్పినాడు. పూర్ణాధికారిగాయున్న ఆశిష్యునికింకనూ సాధన యెందుకు? పరిపూర్ణ పరబ్రహ్మము సాధనా సాధ్యము కాదుగదా!

కర్మజ్ఞానములచేత నేర్పబడినదే హృదయగ్రంధి ఇదే యెరుక. యీ హృదయ గ్రంధి విచ్ఛేదన మొనర్చుటకు యేసాధనలూ పనికిరావు. భ్రాంతి జనకములగు సాధనముల వలన భ్రాంతి పెంపొందునే గాని భ్రాంతిరహితము కాజాలదు.

పరిపూర్ణపరబాహ్మము నెరిగి యెరుకలేక సేవించవలయునన్న; యిందుకు భ్రాంతి రహితాసక్తుడైన శిష్యుని అకుంఠిత భక్తియును మరియు పరమగురుని దయయు యవసరము. హృదయ గ్రంధి వీడుటకు నివియే ముఖ్యములుగాని సాధనలుకావు. కం|| అష్టాంగయోగములనతికష్టించే ప్రజలవలెనె కష్టించక యీ స్పష్టమగు బోధ, వినునీ కష్టములన్నియును తొలగి కడకేగుసుమీ|| యని కృష్ణదాసుగారు తెలియజేసినారు.

కర్మసాధనలు కేవలము చిత్తశుద్ధి కొరకు కల్పింపబడినవి. వస్తు నిశ్చయము కొరకు నివి నిష్ప్రయోజనములని వేదాంతమే నిర్ణయించు చున్నది. శ్లో|| చిత్తస్యశుద్ధయే కర్మనతువస్తూప లబ్ధయే వస్తుసిద్ధిర్విచారేణన కించిత్కార్మకోటిభిః|| వి.చూ. అచల సిద్ధాంతమందు నీ సాధనలు కర్మలు నిష్ప్రయోజనములేగాక సిషిద్ధములనికూడ తెలుపబడినది. ఏ సాధనల జోలి నేనొల్లనని నీవు బాసజేసితివేని పరిపూర్ణబోధ నెరిగింతునని గురువు శిష్యుని యాజ్ఞాపించడములోగల నిషేధార్థము నిక్కడ ముఖ్యముగా గమనించదగినది. కం|| సాధనలు చెప్పి శిష్యుల బాధల పెట్టేటి గురుని బాటవదలి యేబాధలు లేనీ బోధను సాధుల సేవించి వినుము సద్గుణశాలీఖ యనుకందపద్యములో సాధనల జెప్పే గురువుల బాట విధిగా విడిచిపెట్టమని శిష్యుని కాదేశిం పబడినది సాధనల గురించి యితర వేదాంత పద్ధతులయందు నిట్టి విధి నిషేధములు లేవు. వస్తునిశ్చయము కొరకు సాధనలు నిష్ప్రయోజనములని మాత్రము నెరిగింపబడినది. భ్రాంతి రహిత విధానమును ప్రబోధించే అచల సిద్ధాంతమందు సాధనలు నిషిద్ధములు. ఏలననగా సాధకుడు, సాధన, సిద్ధి అనే త్రిపుటిరహితంగదా, పరిపూర్ణ పరబాహ్మము? తత్వవిచారణకు శ్రవణమనన నిధిధ్యాస లవసరముగదా! అట్టి తత్వ విచారణకూడ యొక సాధన యనవచ్చునేమోకాని యెరుకను రహితము జేయు అచల సిద్ధాంత

సంబంధమగు తత్వ విచారమును సాధన యనుటకు వీలులేదు. సాధన శబ్దముతో సాధకుడు, మరియు సాధ్యవస్తువుల భావము స్ఫురించును. అచల సిద్ధాంత తత్వ విచారమువల్ల సాధకుడు యనగా యెరుక నశించిపోగా సాధ్య వస్తు విట్టిదట్టిదని చెప్పుటకు వీలుండదు. కావున సాధకుడు సాధ్య వస్తు సంసిద్ధి యనునవి లేనపుడది సాధన కాజాలదు. గనుకనే సాధించదగు ముఖ్య సాధనను బోధజేయుడని శిష్యుడు గురుమూర్తిని యడుగగా యే సాధన నీకెందుకు వీసానికి పనికిరాదని పై కందార్థమందు చెప్పబడినది. పరిపూర్ణ బోధయందు సాధనలు వీసానికి పనికిరావు. గాని శిష్యుని పూర్ణాధికారిగా చేయుపట్ల సాధన లవసరములేనని గుర్తించదగును.

అశరీరపద్ధతిని ప్రబోధించు అచల సిద్ధాంతమందు సాధనలు నిషేధింపబడుటకు గల కారణమేమి? సాధనలవల్ల సిద్ధులను బొందవచ్చును. కాని జన్మరాహిత్యము సిద్ధించనేరదు. శరీరముతో చేయబడు సాధనలవల్ల సిద్ధించునది సశరీర పద్ధతియేగాని అశరీర పద్ధతి సిద్ధించదు. అస్పర్శ యోగమనబడు యొక అచల సిద్ధాంతమే సాధనలను పూర్తిగా నిషేధించి అశరీర పద్ధతిని ప్రబోధించును. మరియు యెరుకయనే పద్మవ్యూహమును భేదించగలుగును. అన్యమార్గములచేత నిది సాధ్యముకాదు. గనుక యీ దేవమార్గమందు సాధనలు నిషిద్ధములని తెలియవలయును.

# అద్వైతము - అచల సిద్ధాంతము

హైందవ వేదాంతమందు అద్వైత సిద్ధాంతము చాల ప్రాచీనమైనది, పరాకాష్ట జెందినట్టిది. అట్టి అద్వైతమునకు అతీతమైనది శ్రీ శివరామ దీక్షితీయ అచల సిద్ధాంతము. వస్తు నిశ్చయజ్ఞానము లేనివారు కొందరు అద్వైతము అచల సిద్ధాంతము యొకటేయని అందురు. కాని అద్వైతమునకును అచలసిద్ధాంతమునకును చాలభేదము కలదు. ఎరుకను నిర్ణయించేది అద్వైతము. ఎరుకను నిరసించి యెరుక నిరసన ద్వారా పరిపూర్ణ పరబ్రహ్మను ప్రతిపాదించేది అచలసిద్ధాంతం. గనుక అద్వైతమున కతీతమైనది అచలసిద్ధాంతమని తెలియవలయును.

ఎరుకకు చలాచలములను ద్వంద్వ లక్షణములు గలవు. యీ ద్వంద్వ లక్షణములుగల యెరుక చలముగా నున్నప్పుడది ఎరుకయని అచలముగా నున్నపుడదియే పరిపూర్ణ పరబ్రహ్మయని యితరులు భ్రమించినారు. కాని సదా సర్వదా యొకేరీతిగా నుండునది అచలపరిపూర్ణము. అచలము; పరిపూర్ణము, పరిపూర్ణ పరబ్రహ్మ, కేవలాత్మ, పరమపదము, గురుగుహ్యము,

యను శబ్దములు అద్వైత సిద్ధాంతమందు కూడ చెప్పబడినవి. వీటి వాచ్యార్థము యొకటిగాయున్నను లక్ష్యార్థము మాత్రము వేరు. అద్వైత సిద్ధాంతము స్వప్రకాశబ్రహ్మమునే పరిపూర్ణ పరబ్రహ్మమని ప్రతిపాదించు చుండగా యిది లేని యెరుకయని దీని కతీతమైనదే పరిపూర్ణ పరబ్రహ్మయని అచలసిద్ధాంతము నిర్ణయించుచున్నది. గనుక అద్వైత సిద్ధాంతరీత్యా యేది జ్ఞేయమో అచలసిద్ధాంతమందు నది లేని యెరుక. ఎరుక మరుపులు కానిదే పరిపూర్ణమని అచలసిద్ధాంత నిర్ణయము. "ఎరుకే ఇహపరసౌఖ్యము. లెరుకే జ్ఞానంబు జ్ఞేయ మెరుకే మోక్షం బెరుకే భక్తి విరక్తులు యెరుకే సంకల్పమని నీవెరుగు సత్కీర్తి" యను కందార్థమందుగల జ్ఞేయము అద్వైత సిద్ధాంతమందు నిర్దేశింపబడిన జ్ఞేయబ్రహ్మము అనీ గనుకనే యిది యెరుకయనీ తెలియనగును.

కం|| జ్ఞానమగు నీవు జ్ఞేయంబైన బయలుగాంచి జ్ఞానమగు నిను నీవే
లేనంచు దెలియుమని తానానరునకు వాసుదేవుడానతియిచ్చెన్

కం|| జ్ఞానము నేనన నొక్కటె, జ్ఞానము నేవేరటంచు గనబోకుసుమీ
జ్ఞానము వచ్చును బోవును, జ్ఞానాతీతమును తాను గాంచినదాకన్

పై కందపద్యములలోని జ్ఞేయము, జ్ఞానాతీతమను శబ్దములు పరిపూర్ణ పరబ్రహ్మమును సూచించుచున్నవి. ఈ రీతిగా అద్వైతము మరియు శ్రీ శివరామదీక్షితీయ అచల సిద్ధాంతము యొక్క లక్ష్యార్థము వేరని తేటతెల్లమగును.

"నేననని బ్రహ్మములోపల లేనిదె సంభవము నొంది లీలతనకు దామేను జగములై వెలసె" నను కందార్థమందు కూడ అద్వైతమునకును అచల సిద్ధాంతమునకును గల భేదము తెలియజేయబడినది. అహంబ్రహ్మాస్మి. తత్వమసి యను మహావాక్యములద్వారా అద్వైతము నిరూపించబడినది.

శ్లో|| నిర్గుణః కేవలాత్మాఽస్మి నిరాకారోఽస్మ్యహం సదా
కేవలం బ్రహ్మమాత్రోఽస్మి హ్యజరోఽస్మ్యయరోస్మ్యభాం
||తే.బిం||

శ్లో|| అహంబ్రహ్మాస్మి మంత్రోఽయంజ్ఞానానంద ప్రయచ్ఛతి
సప్తకోటి మహామంత్రం జన్మకోటి శతప్రదం. ||తే. బిం||

మహావాక్యములలోని అహం, త్వం (నేను, నీవు) యను ప్రత్యయములు అద్వైత ప్రబోధమునకు మూలాధారములు. నేను నీవుయను ప్రత్యయముల ద్వారా అద్వైతమందు సత్యమగు బ్రహ్మ ప్రతిపాదించ

బడినది. ఈ సత్యమగు బ్రహ్మలోపల మిథ్యాజగము మృగ జలమువలె లేకనే తోచునని బ్రహ్మసత్యం జగన్మిథ్యా అను వాక్యానుసారం యీ దృశ్యప్రపంచము యింద్రియములు మిథ్యాస్వరూపములని ద్రష్టాసాక్షినగు నేను సత్యమగు బ్రహ్మనని అద్వైత సిద్ధాంతము. ఇందుకువ్యతిరిక్తముగా నేనని బ్రహ్మలోపల (పరిపూర్ణ పరబ్రహ్మ యందు) యెరుక (నేను) లేనిదే సంభవము నొందెనని, అదియే మేను జగములై వెలసెనని, పై కందార్థమందు విశదీకరించబడినది.

నేను సత్యం నాచే చూడబడే జగత్తు మిథ్యా (అసత్యం) అని అద్వైత సిద్ధాంతము. నేను, మేను, జగత్తు, యీ మూడును అసత్యములేనని నేనని బ్రహ్మమే సత్యమైనది నిత్యమైనదని సిద్ధాంతము "నిను, నను, ప్రపంచమును జగమని యెరిగే యెరుకచేత అచలమును కనుగొని నిను, నను, జగమును జగమని యెరిగే యెరుక మాను" మని శ్రీ కృష్ణ దేశికులు వేరే కందార్థమందు ఆదేశించినారు. "పిల్లలు తాట్యాకులతో పిల్లలగావించి పెండ్లి పేరంటంబుల్ కొల్లలుగ జేయువారల తల్లులుగని సత్యమనుచు తలచే రామదినీ నిను నీవిట్లు తలచరామదినీ" యను కందార్థమందలి భావార్థమును చక్కగా గ్రహించినచో జగత్తును సత్యమని నమ్మె ప్రాపంచికులకును, జగత్తు మిథ్యా యని బ్రహ్మ సత్యమని తలంచే అద్వైత వేదాంతులకును, మరియు గురుమంత్రసిద్ధులగు పరిపూర్ణ భావజ్ఞనకును, గల భేదములు ద్యోతకమగును.

ఎరుగకుండగయుండే స్థితియే అచలస్థితియని అద్వైతము ఘోషించుచున్నది. ఎరుక లేకుండగ యుండే స్థితియే అచలమని అచల సిద్ధాంతము చాటుచున్నది. ఎరుగకుండగ యుండేస్థితి (విస్మృతి జెందిన స్థితి) యందు యెరుక బీజరూపముగా నుండును. ఎరుక లేకుండగయుండే స్థితి ఎరుక నిర్మూలస్థితి గనుక, ఎరుక భస్మాసురుడు బ్రగ్గిన కరణిగా నాశనమొందును. మొదటి స్థితియందు జన్మరాహిత్యము కలుగబోదని, రెండవ స్థితివల్లనే జన్మరాహిత్యము సిద్ధించునని అచల పరిపూర్ణప్రబోధ తెలియజేయును. కందార్థము || మరుపు సుషుప్తియు మూర్ఛయు, మరణంబు, సమాధి యనుచు మానవులెరుకన్ దొరిగిన నొరుని శరీరము నెరిగె దరానరుడు మేను నెరుగడోయన్నా; యెరుగ కుండితేనేమి తిరిగి పుట్టుచునుండు తిరిగి పుట్టడు వాడీ గురుదోధ కలిగితే యెరుగాడోయన్నా; తననైన తానెరుగాడోయన్నా;

శ్రుతి|| య ఏషుసుప్తేషు జాగర్తి కామం, కామం పురుషో నిర్మిమాణః
తతేవ శుక్రం తద్బ్రహ్మతదేవామృత ముచ్యతే (కఠోపనిషత్)

అంతఃకరణ వ్యతిరిక్తములగు ప్రాణేంద్రియములు నిద్రించుచుండగా తాను మాత్రము నిద్రింపకయే పురుషుడు జాగరూకుడై యుండునో అతడే పరి శుద్ధమైనట్టి బ్రహ్మమని పై శ్రుత్యర్థము.

ప్రాణేంద్రియములు సుషుప్త్యావస్థ జెందినను తాను సుషుప్తిని జెంద కయుండునట్టి యే బ్రహ్మతత్వము గలదో స్థూలశరీరము మరణించినను తాను మరణించకయే పరమతత్వము శేషించియుండునో అట్టి తత్వమును తెలిసికొని అనుభవజ్ఞానము గలవాడు మేల్కొనినవాడని మిథ్యాస్వరూప మగు జగత్తునే సత్యమని నమ్మి వ్యవహరించు ప్రాపంచికుడు కలగనువాడని వేదాంత నిర్ణయము. ఇట్టి కలమేలుకలుగల నిరువురుకిని జననమరణములు తప్పవని పరిపూర్ణబోధచే గురుమేలుక గలవానికే జన్మరాహిత్యము సిద్ధిం చునని అచల సిద్ధాంత నిర్ణయము. గనుక ఎరుగ కుండినంతమాత్రాన యెరుక వీడిపోయినదని తలచరాదు. "ఎరుక తనకుదావీడిపోదెరుకను విడిపించలేరు యెవ్వరు ధాత్రిన్. గురుడొకడు తప్ప " యని నొక్కి వక్కాణింపబడినది.

మృగజలమువలె జగత్తు నిజముగాను అద్వైతుల గజిబిజిమాటల కామో దించి. అధిష్ఠాన బ్రహ్మను వీడి యెరుకయే మృగజలమువలె లేదనీ, నేననని పరిపూర్ణ పరబ్రహ్మయే సత్యమని అచల సిద్ధాంత ప్రబోధ. అద్వైతపద్ధతికి తగినట్టుగా బోధించబడినదని నేననని బ్రహ్మలోపల యనేకందార్థమువలన విదితమగుచున్నది. అధిష్ఠాన బ్రహ్మయనే యెరుకయే మిథ్యాయని, లేనిదని నిరూపించుటకు అద్వైత పద్ధతి యనుసరించబడినంత మాత్రాన అద్వైతము, అచలసిద్ధాంతము యొక్కటేయని పొరబడరాదు. అద్వైతరహితమే అచల సిద్ధాంతము. "ఆగమ నిగమోపనిషత్సాగర మధితార్థమవలది" సాంగోపాంగ ముగా వివరింతునని ఆదిలోనే కృష్ణ దేశిక ప్రభువులు సెలవిచ్చినారు. గనుక అచల సిద్ధాంతము వేదాంతతీతమని సర్వమతాతీతమని కూడ చెప్పబడును.

# జన్మ - కర్మ - జ్ఞానము

"క్లేశమూలః కర్మాశయోదృష్టా దృష్టజన్మ వేదనీయః" యను యోగద ర్శన సూత్రములో పంచక్లేశములకు మూలము మరియు వర్తమాన భవిష్యత్ జన్మలకు కారణము కర్మాశయమని చెప్పబడినది. పంచక్లేశములనగా:- (1) అవిద్యా (2) అస్మితా (3) రాగము (4) ద్వేషము (5) అభినివేశము ఇవి పంచక్లేశము లనబడును. కారణములేనిదే కార్యముండదుగనుక ప్రస్తుత జన్మకుగాని ముందు జన్మలకుగాని కర్మయే కారణమని చెప్పవలయును. ప్రాణులు చేయు కర్మఫలానుసారమే బ్రహ్మయుపాధులను సృష్టించుచుం

డును. అట్టికర్మఫలమును తుడిచి పెట్టుటకు, మార్చుటకు, దేవతలకుగాని, బ్రహ్మకుగాని శక్యముగాదు. భర్తృహరిమహాకవి కర్మాధిక్యమునే వర్ణించి వ్రాసిన క్రింది శ్లోకములో యీ భావమే వ్యక్తము చేయబడినది.

శ్లో॥ నమస్యామోదేవాన్నను హతవిధేస్తే పి వశగా
విధిర్వన్యః సోపిప్రనియత ఫలదాయక
ఫలంకర్మాయత్తం కిమరగణైఃకించ విధినా
సమస్తత్కర్మభ్యో విధిరపినయేభ్యః ప్రభవతి

పూర్వజన్మలలో చేయబడిన కర్మలు సంచితకర్మలని ప్రస్తుత జన్మలో అనుభవించబడు కర్మ ప్రారబ్ధకర్మయని యనబడును. మరియు యీ జన్మలో చేయబడు కర్మలు ఆగామి కర్మలనబడును. అనాది కాలమునుండి చేయబడిన కర్మయే మోక్షమునకు ప్రతిబంధకముగా నుండుటవలన జన్మలకు హేతువగుచున్నది. అనాది కర్మలవలన యేర్పడిన యీ ప్రతిబంధకము నుని తొలగించుకొనుటకు నిష్కామకర్మయోగ మవసరముగనుక భగవద్గీత యందు జ్ఞానయోగమునకు ముందు కర్మయోగమే శ్రీకృష్ణ పరమాత్మచేత అర్జుననకు ఉపదేశింపబడినది. కామ్యకర్మలని, నిషిద్ధకర్మలని, నిత్యనైమిత్తకకర్మలని కర్మలు మూడు విధములు. కామ్యకర్మలు నిషిద్ధకర్మలు త్యాజ్యములని నిత్యనైమిత్తిక కర్మలు మోక్షసాధనములని చెప్పబడును.

శ్లో॥ కర్మణ్యకర్మయః పశ్యేదకర్మణిచ కర్మయః
సబుద్ధిమాన్ మనుష్యేషు సయుక్తః కృత్స్న కర్మకృత్ భ.గ.4-18

కర్మయందు అకర్మ అకర్మయందు కర్మను యెవడు చూచుచుండునో అనగా కర్మయోగమును జ్ఞానాకారముగాను మరియు జ్ఞానము కర్మయోగ మందంతర్గతమగుట వలన మనుష్యులలో బుద్ధిమంతుడు. సర్వశాస్త్రముల నెరిగినవాడని మోక్షమున కర్హుడని పై శ్లోకము యొక్క తాత్పర్యము. ఈ రీతిగా కర్మజ్ఞానములు యొక దానితో నొకటి ముడిబడియున్నవి. జ్ఞానము లేని కర్మలు బంధహేతువులు కానేరవు. కావుననే జ్ఞానపరిపక్వము జెందని లేతవయస్కులు మరియు జ్ఞానవిహీనులైన పిచ్చివారలు చేయు నేరములు శిక్షార్హములు కావని శిక్షాస్మృతి (Penal code) శాసించుచున్నది. జన్మకు మూలము కర్మ, కర్మకు మూలము జ్ఞానమని దీనివలన తెలియనగును. అనేక జన్మలనుండి సంప్రాప్తమైన కర్మబంధమును జ్ఞానాగ్నిచే (బోధచే) దహించగలవాడే గురువు. కర్మబంధమునుండి విముక్తి బొందుటకు గురు వవసరము.

శ్లో || అనేక జన్మసంప్రాప్త కర్మబంధవిదాహినే
జ్ఞానానల ప్రభావేన తస్మై శ్రీ గురవేనమః|| || గురుగీత||

వేదాంతమందు వృత్తిజ్ఞానమని, ప్రజ్ఞానమని, జ్ఞానము రెండు విధములుగా చెప్పబడును. అంతరేంద్రియములనబడు జ్ఞానము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములలోని జ్ఞానము వృత్తి జ్ఞానము లేక యింద్రియ జన్యజ్ఞానమని మరి యెనుబదినాలుగు లక్షల జీవోపాధులలో భాసించునది ప్రజ్ఞానమని దానినే పరమాత్మస్వరూపమనియందురు. ||సీ|| ఆకాశపంచక మంతరేంద్రియములు xxxxxx యిట్టి లిరువదియైదు యింద్రియములు ఇవి ఆత్మగాదని నిన్నిటి నెరిగెటి యెరుకయే పరమాత్మయని యెరింగి సాంఖ్యయోగంబు సాధించి సజ్జనుండు ముక్తిజెందును. నీ పాదభక్తితోను" యని భద్రాద్రి రామశతకమునందు చెప్పబడిన పద్యమీ సమయమున గమనింపదగినది.

వృత్తి జ్ఞానమునకు వ్యావహారిక సత్యత్వమేకాని పారమార్థిక సత్యత్వములేదని ప్రజ్ఞానమే సత్యమైనది శుద్ధమైనది గనుక ప్రజ్ఞానం బ్రహ్మయని వేదాంతనిర్ణయము. ప్రజ్ఞానమని, విజ్ఞానమని, సుజ్ఞానమని, శుద్ధజ్ఞానమనునవి, సమ్యక్ జ్ఞానమని, యొకే జ్ఞానము యొక్క పరిణామ రూపములనీ యెరుక మరుపులకు మారుపేర్లనీ యెరుక అచల సిద్ధాంతనిర్ణయము. ఈ లేనెరెకకు వ్యావహారిక సత్యత్వముగాని పారమార్థిక సత్యత్వముగాని లేదు. అది లేనెరుక కాబట్టి మిథ్యాస్వరూపము, మాయ. లెనెరుకను బయలందున లేనేలేదనక యితరులేలపలికిరో లేనిది కలదని పిదపను లేనేలేదనుచు సిగ్గులేక యీలీల ఛీ వినకే చికాకునీ కేల xx xxx" యని శ్రీ భాగవత కృష్ణదేశికులు రచించిన కందార్థమందీ భావమే వివరించబడినది. చలాచలములను ద్వంద్వ లక్షణము లెరుకయందు గలవు. అట్టి ద్వంద్వ లక్షణముల కనుగుణముగా వ్యావహారిక సత్యత్వమని పారమార్థిక సత్యత్వమని ద్వంద్వరూపములు లేని యెరుకయందు కల్పించియు లేనెరుకనే పరిపూర్ణ పరబ్రహ్మయని భ్రమించినారు. ఇందుకు శ్రుతిప్రమాణములు "తదేజతి తన్నైజతి తద్దూరే తద్వంతికేతదంతరస్య సర్వస్య తదుసర్వస్యాస్య బాహ్యతః" ఈశావాస్యోపనిషత్. శ్రుతి - ఏకం అనేకం " శ్రుతి "సోऽకామయత" "ఏకోऽహం బహూస్యాం" పై శ్రుతివాక్యములద్వారా ఎరుకయొక్క ద్వంద్వలక్షణములు విదితమగును.

"రాకడ పోకడ లేకను యేకస్థితినుండునట్టి యీ బయలందున్ రాకడ పోకడగలిగి యనేకముగాదోచు xxxxx " యెరుకకీలు గురునిచే యెరుగనిదే1 ఈ యెరుక భ్రమతొలగదు. "శ్రుతులందు స్మృతులందు యితిహాసముల

యందు సతతము శ్రమపడి వెతకిన యీ యెరుక నిలువబోదు. గనుక గురుమంత్రముచే నిలువని యెరుకను పరిపూర్ణమనుచు నెరిగి నిరతమున్ యెరుకై (యెరుకస్వరూపులై) యుండినవారల తెరువికనీకేల వట్టిదీ జోలి మాను యెరుకలేని యీ జోలిబూను" మని శ్రీకృష్ణ దేశికులాదేశించినారు.

"ఎరుకొక్కటుంటేనే యేర్పాటులుండును" భేదములు కలుగును. భయ భ్రాంతుల కాస్పదమేర్పడును. కావున గురుముఖతః పరిపూర్ణ మెరుకలనెరిగి యెరుకలేక సేవించమని అచల సిద్ధాంతము ప్రబోధించుచున్నది. ఎరుకను విడనాడిన యీ పురుషుడు సరిపడు సరిపడదనకను సరిగా వర్తింపుచుండు సమరసబుద్ధిన్ పరిపరివిధముల పరుగులు పెట్టడు మరి వైరాగ్యముచేత మానుకొనియుండడు. బాలోన్మత్త పిశాచవత్ ఆసక్తి రహితుడై నిర్భయ ముతో ప్రవర్తించుచుండును. శ్లో|| సర్వం వస్తు భయాన్వితం భువిన్నృణాం వైరాగ్యమేవా ~ భయం" పరిపూర్ణ పరబ్రహ్మయందు ఆత్మ (యెరుక) మృషయని గురువుద్వారా తెలుసుకొని ఆత్మయందు ప్రీతిని విడిచియుండడమే నిజమైన వైరాగ్యము. అట్టి వైరాగ్యమే మానవులకు జనన మరణములనే ఘోర సంసారము నుండి అభయము ప్రసాదించును. అన్యమార్గములచేత భయనివృత్తికాజాలదు. "భయస్థానసహస్రాణి శోచస్థాన శతానిచ"

పాపపుణ్యములు భువి ప్రాపించును యెరుకచేత భ్రమసిన వారిన్, యెరుకను విడిచిన తాపసులను పాపపుణ్యములు ప్రాపించవు. అట్టి తాపసులు చేయు కర్మలు సహజకర్మలు, గనుక బంధహేతువులు కాజాలవు. గనుక వారలకు సంచిత ప్రారబ్ధ ఆగామీ కర్మలనునవిలేవు. ఇట్లు జ్ఞాన రహితమే కర్మరహితమని కర్మరహితమే జన్మరహితమని సూటిగా చక్కగా అచలసిద్ధాంతము ప్రబోధించును.

కం|| కొందరు కర్మమునే బాగందురు మరికొంద రెక్కువందురు
తనువున్ కొందరు ప్రాణము లధికములందురు నీకిట్టి వట్టి
యాశాలేమిటికి వారితో పొందుజేసేవేమిటికి యెందారిమాటల
నెన్నిన యీబోధక్రిందివేకాని పై కెక్కేవి గావిట్టి యాశా లేమిటికి
వారితో పొందుజేసేవేమిటికి||

# భగవద్గీత యొక్క పారమార్థిక ప్రాముఖ్యత

భగవద్గీత అనగానే కురుక్షేత్రము జ్ఞప్తికి వచ్చును. కురుక్షేత్రమందు కౌరవపాండవులమధ్య జరిగిన మహాభారతయుద్ధము. యుద్ధ రంగమున

నిలచిన సైనికులు రథులు, మహారథులు, ద్రోణుడు, కర్ణుడు, భీష్ముడు, దుర్యోధనుడు, అర్జునుడు, భీముడు. ధర్మరాజు మున్నగువారు స్మృతిప థమునకువత్తురు. ఈ సన్నివేశములో అర్జునుడు మరియు శ్రీకృష్ణుడు రథసారథియైనాడు. ఉభయసేనల మధ్యనిలచి యిరుపక్షములయందుపస్థితు లైన పితృలను, పితామహులను ఆచార్యులను, మామలను, భ్రాతృలను, సఖులను బాంధవులను జూచి అర్జునుడు వ్యాకులచిత్తుడై ఖేదముతో తన మనోగత విచారములను శ్రీకృష్ణునితో చెప్పుకున్నాడు. మనోదౌర్బల్యమునకు లొంగి యుద్ధము చేయునని నిరాకరించినాడు. అప్పుడు శ్రీకృష్ణుడు అర్జునకు హితోపదేశము చేసినట్లు అట్టి హితోపదేశము వలన అర్జునుడు యుద్ధము నకు ప్రేరితుడైనట్లు భగవద్గీత తెలియుచెప్పుచున్నది. అయితే శ్రీకృష్ణుడు చేసిన హితోపదేశము లౌకికమా లేక పారలౌకికమా? లౌకికమైనచో భగ వద్గీత చారిత్రిక గ్రంథమని చెప్పవలసియుండును. పారలౌకికమైన యెడల పారమార్థిక గ్రంథమని నిర్ణయమగును. భగవద్గీత కేవలము చారిత్రిక గ్రంథము కాదని పారమార్థికమైన పవిత్రగ్రంథమని నిరూపించడమే యీ వ్యాసముయొక్క ముఖ్యోద్దేశము.

శ్లో|| ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతాయు యుత్సవః
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ||

ధర్మక్షేత్రమగు కురుక్షేత్రమందు యుద్ధం చేయగోరిన కౌరవులు పాండ వులు యేమిచేసిరని ధృతరాష్ట్రుడు సంజయుని అడిగినట్లు సంజయుడు శ్రీకృష్ణార్జునులకు జరిగిన సంవాదమును ధృతరాష్ట్రునకు ఎరుక పర చినట్లున్ను శ్రీకృష్ణార్జున సంవాదరూపము గానున్నదే భగవద్గీతయైన ట్లున్ను మనము తెలిసికొనియున్నాము. శ్రీకృష్ణ రుక్మిణీ సంవాదము సీతారామాంజనేయ సంవాదము, ఉమామహేశ్వర సంవాదము మున్నగు తత్త్వబోధకములగు గ్రంథముల రీతిగానే భగవద్గీత కూడ భగవత్తత్త్వమును ప్రబోధించునట్టి పవిత్ర గ్రంథము. ఆచార్యులను పితృలను, పితామహు లను బాంధవులను తానుచంపనున్నాడనేభ్రాంతికి అర్జునుడులోనై యట్టి యుద్ధమువలన నరకప్రాప్తి కలుగునని భీతిజెంది కింకర్తవ్యమూఢుడై శ్రేయ స్కరమగు మార్గములను తనకుచూపెట్టుమని తన సారథియగు శ్రీకృష్ణుని అడిగినట్టు చిత్రింపబడ్డాడు.

శ్లో|| కార్పణ్య దోషోపహతస్వభావః
పృచ్ఛామిత్వాం ధర్మసమ్మూఢచేతాః
యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహితన్మే
శిష్యస్తేహం శాధిమాంత్వాం ప్రపన్నం||

పై శ్లోకములో అర్జునుడు శ్రీకృష్ణునికి శిష్యుడై శరణాగతుడై సత్యప్రబోధమునకై ప్రార్థించినాడు గనుక భగవద్గీతను గురుశిష్య సంవాదమనుటకూడ సమంజసమే యగును.

శ్రీకృష్ణుడు గురురూపమున తన శిష్యుడగు అర్జుననకు సాంఖ్య యోగము మొదలుకొని మోక్షసన్యాసయోగము వరకు తత్వప్రబోధ జేసినాడు.

శ్లో|| ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేర్జునతిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢానిమాయయా||

తమేవ శరణంగచ్ఛసర్వభావేన భారత
తత్ప్రసాదాత్పరాం శాంతింస్థానం ప్రాప్స్యసిశాశ్వతం||

ఇతితే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛ సితథాకురు||

సర్వగుహ్యతమం భూయః శృణుమే పరమం వచః
ఇష్టోసిఽమే దృఢమితి,తతోవక్ష్యామితే హితం||

మన్మనాభవ మద్భక్తో మద్యాజీమాం నమస్కురు
మామేవైష్యసి సత్యంతే ప్రతిజానే ప్రియోఽసిమే||

సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణంవ్రజ
అహంత్వాసర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః||

చివరి అధ్యాయములలో గల పై శ్లోకముల ద్వార ప్రబోధింపబడినది. కేవలము భగవత్తత్వమేకాని యుద్ధతంత్రము కాదని యీ శ్లోకములు చెప్పకనే చెప్పుచున్నవి. ఉపక్రమోపసంహారములదృష్ట్యా పరిశీలించగా భగవద్గీత వేదాంతసంబంధమైనదను విషయము సుస్పష్టము. యిది కురుక్షేత్రమందు జరిగిన మహాభారత యుద్ధమునకు సంబంధించిన కేవల చారిత్రక గ్రంథము కానేరదు. యుద్ధ సంబంధమగు చారిత్రక గ్రంథమంటె యుద్ధ సందర్భముయొక్క యౌచిత్యమునకు ప్రతికూలమగు శ్లోకము లిందుగలవు. ఉదాహరణము కొరకు భగవద్గీత ఆరవ అధ్యాయములోని 11-12-13 -14 శ్లోకములను చూడుడు. పవిత్రమైన ప్రదేశమందు అత్యున్నతము లేక అతినీచము గానటువంటి ఆసనము ఏర్పరచుకొని జ్ఞాని దర్భ, మృగ చర్మము మరియు వస్త్రం పర్చుకొని అట్టి ఆసనముపై తాను ఆసీనుడై ఏకాగ్రమనస్సుతో యింద్రియములను వశపర్చుకొని ఆత్మశుద్ధి కొరకు తన శరీరమును గ్రీవమును (మెడను) శిరస్సును చక్కగా నిలుపుకొని నాసికా

గ్రము నవలోకించుచు అటు యిటు చూడక యోగము నభ్యసించవలయునని శ్రీకృష్ణుడు అర్జునునకు చెప్పినట్లు పై శ్లోకములయొక్క తాత్పర్యము.

ఈ శ్లోకములోని భావార్థము యుద్ధనీతికి పూర్తిగా విరుద్ధమైనదని వేరుగా చెప్పనక్కరలేదు. గనుక భగవద్గీత యుద్ధతంత్రమునకు సంబంధించిన చారిత్రిక గ్రంథము కాదనియు యిది జీవాత్మ పరమాత్మలకు గల సంబంధమును తెలియుచేసెడి పారమార్థిక గ్రంథమని తెలియనగును. భక్తి జ్ఞాన వైరాగ్య ముముక్షత్వమును ప్రబోధించెడి గ్రంథరాజము గనుక దీనికి భగవద్గీతయను సార్థకనామము గలదు. మహాభారతయుద్ధము జరుగనేలేదని కాని మహాభారతము కల్పితకథయనికాని నే చెప్పడములేదు. కురుక్షేత్రమందు మహాభారత యుద్ధము జరిగిన జరిగియుండుగాక, లేదా మహాభారతమను గ్రంథము పంచమ వేదముగా చెప్పబడుట వలన భారతీయ తత్వశాస్త్ర ములలో నొకటిగానది పరిగణింపబడిన బడుగాక. కురుక్షేత్ర సంగ్రామముగా వర్ణింపబడిన కౌరవ పాండవుల యుద్ధమును భూమికగా తీసుక దుర్గ్రాహ్యమగు భగవత్తత్వము పండితులకు పామరులకు కూడ సుగ్రాహ్య మగునటుల భగవద్గీతయందు ప్రబోధింపబడినదని నా అభిప్రాయము. భాగవత మందు కూడ నిట్టి కథల ద్వారానే వేదాంత విషయములు ప్రబోధింపబడినవను విషయము గమనింపదగినది. తత్వప్రబోధకు నీతి బోధకు కూడాను కథలు నాటకములు మంచి సాధనములుగా ప్రాచీన భారతీయ తత్వవేత్తలచే సాహితీ పరులచే స్వీకరింపబడినవి. కనుక మనపూర్వజులు వేదాంత విషయములను సామాన్యులకు సుబోధకములగునట్లు కథారూపమున ప్రబోధించినారనుటలో సందేహము లేదు.

పూర్వమెప్పుడో జరిగిపోయిన కురుక్షేత్ర సంగ్రామమునకు సంబంధించినది భగవద్గీత యనుటకంటె ప్రస్తుతము మనలో ప్రతిక్షణము ధర్మాధర్మములకు, సత్యాసత్యములకు, మంచి చెడ్డలకు మధ్య జరుగుచున్న సంఘర్షణకు సంబంధించినదనుటలో దానియొక్క విశిష్టత తెలియబడగలదు. అంతేగాదు జీవాత్మ పరమాత్మలకుగల సంబంధము తెలుపునట్టిది భగవద్గీత కనుకనే సర్వమానవులకు సర్వ కాలములలో దాని యావశ్యకత గలదు. కావున ప్రపంచమందుగల పెక్కు భాషలలో భగవద్గీత యొక్క అనువాదములు ప్రచురింపబడినవి; నేటికి ప్రచురింప బడుచున్నవి. భగవద్గీతయొక్క ప్రాశస్త్యమునకు నిది ప్రబల తార్కాణమనగా పేర్కొనవచ్చును. ద్వైతాద్వైత విశిష్టాద్వైత మతాచార్యులు తమ తమ మతానుసారం భగవద్గీతకు వ్రాసిన భాష్యములు కూడ యిది యొక వేదాంత గ్రంథమనుటకు నిదర్శనము. భారతీయ తత్వశాస్త్రములో పేర్కొనబడిన ప్రస్థానత్రయములో భగవద్గీత

యొకటి. ఉపనిషత్తులు బ్రహ్మసూత్రములు భగద్గీత యీ మూడిటి యొక్క గ్రంధసంపుటి ప్రస్థానత్రయమనబడును.

ఇదియునుగాక కఠోపనిషత్తులోని శ్లోకములు భగవద్గీతయందలి శ్లోకములు కొన్ని యొకేరీతిగా నున్నవి, ఉదాహరణార్థము యీ క్రింది శ్లోకములను తిలకింపుడు.

కఠోప:- ౧ అధ్యాయము ౨ వల్లి. ౧౮ వ మంత్రము నజాయతేమ్రియతేవావిపశ్చిన్నాయంకుతశ్చిన్నబభూవకశ్చిత్ అజోనిత్య శ్శాశ్వతోయం పురాణోనహన్యతే హన్యమానేశరీరే||

భగవద్గీత 2 అధ్యాయము ౨౦ శ్లోకము. నజాయతేమ్రియతేవాకదాచిన్నాయం భూత్వా భవితావానభూయః

అజోనిత్యశ్శాశ్వతోయం పురాణో నహన్యతే హన్యమానే శరీరే||

కఠోపని ౧ అధ్యాయము. ౨ వల్లి ౧౯ మంత్రము.
హంతాచేన్మన్యతేహం తుగుమ్‌హతశ్చేన్మన్యతే హతం
ఉభౌతౌన విజాతో నాయుగ్‌హన్తి నహన్యతే
భగవద్గీత ౨ అధ్యాయము ౧౯ శ్లోకము.
యయేనంవేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతం
ఉభౌతౌ న విజానీతోనా యంహంతి నహన్యతే||
కఠోప ౧ అధ్యాయము 3 వల్లి ౧౦ మంత్రము.
ఇంద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరంమనః
మనసశ్చ పరాబుద్ధిర్బుద్ధేః రాత్మామహాన్పరః
భగవద్గీత 3 అధ్యాయము ४౨ శ్లోకము.
ఇంద్రియాణి పరాణ్యాహురింద్రియేభ్యః పరం మనః
మనసస్తు పరాబుద్ధిర్యో బుద్ధేః పరతస్తుసః

పై కారణములచేత భగవద్గీత పారమార్థికమగు పవిత్ర గ్రంథమని కర్తృత్వరహితమైన కర్మాచరణమే భగద్గీతోపదేశమని తెలియుచున్నది. కర్తయనగానేమి? కర్తృత్వరహితమైన కర్మాచరణ మెటుల సిద్ధించుననుం విషయమును నిజగురు సాంప్రదాయక ప్రబోధచేత తెలుసుకొనవలయును.

## అచలోయం సనాతనః

శ్లో|| నాసతోవిద్యతేభావోనాభావోవిద్యతేసతః
ఉభయోరపిదృష్టోన్త స్త్వనయోస్తత్వదర్శిభిః|| భగ.2-16.

నశించుదానికి సత్యత్వంలేదు. సత్యమైనదానికి నాశనములేదు. ఈ రెంటియొక్క నిర్ణయము తత్వజ్ఞులచే తెలియబడినదని పై శ్లోకము యొక్క తాత్పర్యము.

సత్యమైనదేది అసత్యమైనదేది యను విషయములో మతాల వారికి భేదాభిప్రాయము గలదు. చార్వాకమతమందు దేహమే సత్యము సుఖానుభవమునకు యీ దేహమే ముఖ్యము గనుక అప్పుచేసియైనను పప్పన్నము తిని దేహమును పోషించవలయునని ప్రకృతివల్లనేజగత్తు యొక్క సృష్టి యేర్పడినదని కావున ప్రకృతియే సత్యమైనదని ప్రకృతిని మించిన పరమాత్మయునునది లేదని చార్వాక మతస్థుల నిర్ణయము. ప్రకృతి జడము గనుక సృష్టికి కారణముకాజాలదని పరమాత్మ చిత్స్వరూపుడు గనుక పరమాత్మవల్లనే సృష్టి యేర్పడినదని దేహము అసత్యము దేహిసత్యమని వేదాంతనిర్ణయము.

ద్వైతమతానుసారం దేవుడు జీవుడు రెండును సత్యములు. అద్వైతమతానుసారం జీవజగత్తులు మాయ యనగా మిథ్యాస్వరూపములు. కావుననే బ్రహ్మసత్యం జగన్మిధ్యాయని అద్వైత నిర్ణయము.

ద్వైతమతము భక్తి మార్గమును అద్వైతమతము జ్ఞానమార్గమును ప్రబోధించును. భక్తిమార్గమున భక్తుడు పూర్తిగా భగవంతునకు స్వాధీనమై తాను నిమిత్త మాత్రుడనని తలంచును. వేదాంతమందు దీనినే మార్జాలకిశోర న్యాయమందురు. మార్జాల కిశోరమునకు (పిల్లి కూనకు) తల్లిపట్టెగాని పిల్ల పట్టుయుండదు. అట్లే భక్తుడు భగవంతునిపై ఆధారపడియుండును. జ్ఞానమార్గమున జ్ఞాని అహంబ్రహ్మాస్మి నేనే బ్రహ్మనని జీవజగంబులు మాయ యని భావించును. దీనినే మర్కట కిశోరన్యాయమందురు. కోతిపిల్లకు తన పట్టెగాని తల్లి పట్టుయుండదు. అదేరీతిగా అద్వైతి స్వయంబ్రహ్మనని స్మరించుచుండును. తనకు అన్యమైనదానిని మిథ్యాయని తలంచును ఇట్లు స్వాధ్యయనం మరియు స్వాధ్యాపనం అద్వైతమునకు ముఖ్యావసరములు.

ఎరుకేజ్ఞానంబు జ్ఞేయమెరుకె మోక్షంబెరుకే భక్తి విరక్తులు యెరుకే జీవుం డీశుండెరుకే తదేకత యెరుకే యని పరిపూర్ణపరబ్రహ్మమందు యిది లేని యెరుక యని అచలపరిపూర్ణము నిత్యమైనదని శ్రీ శివరామదీక్షితీయ అచలసిద్ధాంతము చాటుచున్నది. దేహమునుజూచు కన్నులు దేహమునకు వేరులేనితీరున యెరుకే కోహం కస్త్వం తవదాసోహం సోహంసోహంబటంచు చూచుచుండును. తనకుతానే తోచుచుండును. దేహి దేహములనే తెరగున ప్రసరించి దేహముగాని విదేహిగా తనను చూచుచుండును. గనుక అచల సిద్ధాంతరీత్యా దేహి దేహములు (నేనుమేనులు) రెండును అసత్యములే.

నేను యెరుక, మేను మరుపుయనబడును. ఎరుక మరుపుల కతీతమైన దేఅచలపరిపూర్ణపరబ్రహ్మము.

అచలసిద్ధాంతము ఆస్తికమతమా లేక నాస్తికమతమా? ద్వైతమా లేక అద్వైతమా? యని యంటె యిందులో యేమతమునకు సంబంధించినదికాదు. అచలసిద్ధాంతమును ఒక మతమని పేర్కొనుటయే తప్పు. ఏలననగా ప్రపంచములోని ప్రతిమతము ఆయామతస్థులయొక్క స్వాభిమానముతో కూడుకున్నది. తమ మతమే శ్రేష్ఠమైనదని యితర మతములశ్రేష్ఠములైనవని వారి నమ్మకము. అట్టి యభిమానమును రహితపరచేది అచలసిద్ధాంతము. గనుక దీనిని యొక ప్రత్యేకమతమని చెప్పరాదు. మతములవారలు తమ సమ్మతమైనటునంటి శాస్త్రమర్యాదలచే మితమేరుపరచుకొని బహుగతుల కలహింతు రట్టిగతి నీకేమిటికి చపలతజెందేస్థితి నీకేమిటికని శ్రీ భాగవతుల కృష్ణదేశికులు రచించిన శుద్ధనిర్గుణతత్వకందార్థమందు తెలియజేయబడినది. మరియు ప్రతిలేని యీ బట్టబయలుండజూచి సతతము లేనెరుక లేనిదని నమ్ముమని ప్రబోధింపబడినది.

జీవభ్రాంతి మరియు యీశ్వరభ్రాంతి రెండును జన్మకు హేతువులు. అద్వైతి నేనేబ్రహ్మనని తనకేతరమైనదానిని యెరుగకుండినను, ద్వైతి తనను యితరమును నెరుగుచుండినను. యిరువురికి చావుపుట్టుకలు తప్పవని అచలపరిపూర్ణప్రబోధచేత వీరికి గురుమేల్కొ గల్గినచో తిరిగి పుట్టరని జన్మరాహిత్యమునకు నిదియే సూటిమార్గమని అచలసిద్ధాంతము హెచ్చరించుచున్నది.

మతాలవారి విశ్వాసానుసారం దృశ్యజగత్తు బ్రహ్మయొక్క స్వసంకల్పముచే తనయొక్క లీలకొరకు ఆనందముకొరకు సృష్టింపబడిన దని సృష్టిస్థితిలయములకు ఆశ్రయుడని అతడేసత్స్వరూపుడని చిత్స్వరూపుడని ఆనందమయుడని (సచ్చిదానందుడని) అందురు. జగత్సృష్టికి కారణమైన బ్రహ్మపరిపూర్ణపరబ్రహ్మ కాదని లేని యెరుకయని దీని కతీతమైనదే పరిపూర్ణపరబ్రహ్మయని అది సచ్చిదానందరహితమనిసృష్టి స్థితిలయముల నెరుగనిదని అచలమని సనాతనమని నిత్యమని అచలసిద్ధాంతము చెప్పుచున్నది. సంకల్పాదిక గుణముల సంకుల మెరుక యందు సమకూడియుండును. అచలమందుండదు. గనుక యీ రెండొకటెయని తలంచరాదు.

ఈ అచలదేవుణ్ణి (పరిపూర్ణ పరబయలును) యుపనిషత్తులవల్ల శాస్త్రములవల్ల తెలియుట వీలుపడదు. కేవలము గురుకృపవల్లనే పరోక్షముగానున్న బయలు అపరోక్షమగును. కావుననే దేవుణ్ణి నిన్ను యెరుగవు నీవిప్పటి

కెట్టివారో నేదెల్పైదనికే వెల్టిబోధలెందుకు కావున దేవుణ్ణి యిదిగో కను గొనవోయి నామరూపకర్మాలేవోయి, నీవా దేవునిలోన నిను లెస్సవెదకి నన్నావలి ముచ్చట నడుగోయి దెల్పైదనని కృష్ణదేశికులు శెలవిచ్చినారు. అల భద్రాచలమనిన బయలుగా గుర్తె రుగవలయు యెరుకనే విష్ణువందు లదోచి గురునిక్రుపచే నిలువక విష్ణైగిరిపోతే నిశ్చయమిదేరా కృష్ణదాసు నిశ్చయమిదేరా యని వేరొక కందార్థమందు తెలియపరచినారు.

ఇట్లు భద్రమై అచలమై యెల్ల కాలమందు యేకరీతిగానుండునది పరి పూర్ణ పరబ్రహ్మము. దీనియందు నేననే యెరుక యేకాలమందును లేకనే మృగ జలమువలె తోచుచున్నది. జననమరణములకు పాపపుణ్య ములకు చేటుపాటులకు సర్వభ్రాంతులకు మూలమైనది. యీ లేనెరుక అచలపరిపూర్ణమును గురుసూచనచే కనుగొని భస్మారుడు బ్రుగ్గిన కర ణిగా ఏకోశమందునా నిలువక బ్రుగ్గినయడల తిరిగిపుట్టదు. ఇదియే జన్మరాహిత్యమనబడును. పరిపూర్ణమెరుకల నీరీతిగా గురుముఖతః తెలుసు కొని పరిపూర్ణమందు నేను లేననే నిశ్చయముగలవాడు; అద్వైతివలె నేను బ్రహ్మననడు, ద్వైతివలె నేను భక్తుడననడు. యెరుకలేక సహజకర్మముల నాచరించుచుండును. ఇదియేపరిపూర్ణప్రబోధనిర్ణయం జన్మరాహిత్యంగోరు సర్వులచే నిది అవశ్య మవలంబనీయము.

# అచల సిద్ధాంతము మెట్ట వేదాంతమా?

అచల సిద్ధాంతము మెట్టవేదాంతముకాదు శుష్క వేదాంతము కాదు. ఆగమనిగమోపనిషత్సాగరమధితార్థమవలిది, అయిన పరిపూర్ణ పరబ్రహ్మ మునుప్రబోధించెడిది. సనాతనమైనది. అచలసిద్ధాంతము. సాంఖ్యతారక అమనస్క మహావాక్యములచేత నిర్ణయింపబడిన దానిని నిరసించునది అచల సిద్ధాంతము. సర్వభ్రాంతులను పారదోలునది అచల సిద్ధాంతము. జన్మ రాహిత్యమునకు సూటిమార్గము చూపెట్టునది అచల సిద్ధాంతము. ఇట్టి పవిత్రమైన సిద్ధాంతమును మెట్టవేదాంతమని శుష్క వేదాంతమని చెప్పుట వలన దాని పవిత్రతకు యేలాటి భంగము వాటిల్లదు సరికదా అట్లు చెప్పిన వారలు తమ అజ్ఞానమును మాత్రము ప్రకటించుకున్న వారలు కాగలరు. ఇట్టి అజ్ఞానులనుగురించియేకాబోలు శ్రీ భాగవత కృష్ణదేశికులు తాము రచించిన శుద్ధ నిర్గుణతత్వ కందార్థములో "చక్కెరమెక్కక లోకులు చక్కెర మాధుర్య మెరుగజాల రటువలెన్ మక్కువతో విని చదువక చక్కగ గ్రందార్థ మెరుగజాలేరాజను"లని చెప్పినారు.

అచల సిద్ధాంతమును గురించి యేమియు తెలియనట్టి తెలుసుకొన గోరనట్టి కొందరు మూఢులు అణాకు అచలం పావులాకు పరిపూర్ణమని పరిహసించుచుందురు. తేళ్ళను పాములను చంపెడు రీతిగా అచలులను చంపినను పాతకముకలుగదనికూడ కొందరుదుష్టులు పలికెదరు. అచల సాంప్రదాయకులయందు, వారలకంతటి పాపములు కనుపడినవా? లేక అచల సిద్ధాంతము యొక్క ప్రచారమువల్ల తమ పేరు ప్రతిష్ఠలకు భంగము కలుగునని భీతికలిగినదా? ఇతరులయందు దోషములను ఆరోపించుట, తమ పేరుప్రతిష్ఠలను నిలబెట్టుకొనుటకు యితరులను దూషించుట, దుష్టాత్ములకు సహజగుణములు. "జారులకు లోకులందరు జారులవలెతోచబడుట సహజగు ణంబు చోరులకు సకల జనములు చోరకులని మదికి దోచుటునికి సహజమురా అట్లనే దుష్టాత్మునికి సహజమురా సారములేని సంసారాబ్ధి దాటించువారిని తమవంటివారిగ గనుటట్టియునికి సహజమురా" యని శ్రీకృష్ణదేశిక ప్రభు వులు వేరొక కందార్థమందు శెలవిచ్చినారు. అచల సాంప్రదాయకులను చంపినను, అచల సిద్ధాంతము నిర్మూలించబడునది, నశించునది, కాదని ఈ అవివేకులకు తెలియుదు. శ్లో॥ నజాయతే మ్రియతేవాకదాచిన్నాయం భూత్వాభవితా వానభూయః అజోనిత్యశ్శాశ్వతో . యం పురాణో నహన్యతే హన్యమానే శరీరే॥ భ.గీ. 2-20.

"నేననని బ్రహ్మ "పరిపూర్ణ పరబ్రహ్మయని అచలసిద్ధాంతము ప్రతిపా దించుచున్నది. కావుననేనేబ్రహ్మ (అహంబ్రహ్మాస్మి) యనినిక్కి నీల్గెడువాడే అచల పరిపూర్ణ ప్రబోధను వినడు, వినగోరడు. కొందరు భక్తి త్రయమున, కొందరు యోగముల యందు. కొందరు జ్ఞానంబందు. రమింతురు. వారలకందరికే బోధగిట్టదు. గిట్టనంతమాత్రమున అచలులను అచల సాంప్ర దాయమును తిట్టుట తగదు.

కం॥ పాషండమతము, వారల వేషంబులు జూచి శిష్య
వితతి భ్రమించున్ యీషత్తి బోధెరుగక దూషిం
తురు విన్న కన్న దుర్భాషణలన్.

ఎవరేమనినను ప్రతి దూషణలు చేయుమని అచల సిద్ధాంతము ప్రబో ధించదు. పైగాద్వైతాద్వైత విశిష్టా ద్వైతులవలె కీచులాడవలదని హితోపదేశ మొనర్చును. కారణమేమన దూషణ ప్రతి దూషణలు చేయడము. యెరుక చేష్టలు. యెరుకను నిరసించే అచలసిద్ధాంతావలంబకులకు నివి తగవు. అచల సిద్ధాంతము యొక్క ప్రాశస్త్యమును దాని విశిష్టతను తెలియజేయడమే తగు సమాధానము కాగలదు.

శ్రుతి స్మృతులద్వారా భగవత్తత్వమును గూర్చి యేమి చెప్పబడినదో గమనింపుదు,

శృతి|| సోఽకామయతా ఏకోహం బహుస్యాం
ఏకముగానున్న భగవత్తత్వము అనేకము కావలయునని సంకల్పించెను.

శృతి|| ఏకం అనేకం భవతి. ఏకముగా నున్నది అనేకముగా యగును.

శృతి|| అణోరణీయాన్ మహతో మహీయాన్.
ఆభగవత్తత్వము సూక్ష్మాతి సూక్ష్మముగాను స్థూలాతిస్థూల ముగానూ యున్నది.

శృతి|| అజాయమానో బహుధా విజాయతే
పుట్టనిదిపరమతత్వము. బహువిధములగు జీవాత్మరూపములుగా పుట్టుచుండును.

స్మృతి||మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః
జీవలోకములోగల జీవులు కూడ నా అంశమే

శృతి|| తదేజతితన్నైజతి - అది (భగవత్తత్వము)
యొకప్పుడో చలించును, యొకప్పుడు చలించదు.

పై చెప్పబడిన శృతి స్మృతి వాక్యములచేత భగవత్తత్వము ఏకముగాను అనేకముగాను, పుట్టనిదిగాను పుట్టునదిగాను చలించనిదిగాను చలించునది గాను, అనగా రాకడ పోకడ గలదిగా, నున్నది. ఇట్లు రెండు రీతులగాను సంకల్పము గలదిగాను కనుబడుచున్నది యెరుకయే గాని పరిపూర్ణ పరబ్రహ్మము కాదని, రాకడ పోకడ లేకను యేక స్థితి నుండునట్టిది, పరబయలని, రాకడ పోకడ గలిగి అనేకముగా దోచునది లేని యెరుక యని, యీ లేని యెరుకచేత పరిపూర్ణ పరబ్రహ్మమును గురుముఖతః తెలుసుకొని తెలిసిన తెలివిని విడిచి యుండడమే జన్మ రాహిత్యమని, అచల సిద్ధాంతము ప్రబోధించుచున్నది. తెలివి, లేక యెరుక, తనంతట తాను విడిపోదు. యెరుకను విడిపించలేరు యెవ్వరు ధాత్రిన్ పరిపూర్ణ గురువు తప్ప. పరిపూర్ణ ప్రబోధ చేతనే యెరుక విడిపింపబడగలదు. అన్యమార్గములచేత నిది విడిపోదు. ఖండితముగా చెప్పవలయునంటె అచల సిద్ధాంతము తప్ప, అన్యమార్గము లన్నియు యెరుకను నిలబెట్టును. స్థూలరూపముగానున్న యెరుక సూక్ష్మ రూపముగా మారినంతమాత్రాన యెరుక నశించినదని తలంచుట భ్రమ మాత్రమే కాగలదు. ఎరుక బీజరూపముగా శేషించినను, అది జన్మకు హేతువగును. ఎరుక నిశ్శేషముగా నశించనిదే జన్మ రాహిత్యము సిద్ధించదు. కనుకనే యెరుకను నిలుపకుమని యెరుకను యెగరజిమ్ముమని యెరుకను గురు దక్షిణగా యిమ్మని, యెరుక లేక సేవింపుమని, అచల సిద్ధాంతము పదే పదే హెచ్చరించుచున్నది. యెరుకను విడిపించడమె అచల సిద్ధాం

తముయొక్క ముఖ్యోద్దేశము. పరిపూర్ణ గురువుయిది అచల పరిపూర్ణము యిది ఎరుక యని వస్తు నిశ్చయముగా యెరుకపరచి తుదకు యెరుకను విడిపించెదనని శిష్యునికి అభయప్రదానము చేయును. పరిపూర్ణ మెరుకల నెరిగించినంతమాత్రమున పరిపూర్ణ ప్రబోధ పూర్తికాజాలదు. యెరుకను (జ్ఞానమును) పరిపూర్ణమందు లేని యెరుక యని విడిపించడముతో నే పూర్తికాగలదు. యెరుకను విడిపించే విధానముచే అచల సిద్ధాంతము యొక్క విశిష్టతద్యోతక మగుచున్నది.

అచలసిద్ధాంతమునకు సంబంధించిన ఉద్గ్రంధములు తేట తెల్లమగు తెలుగు భాషలో రచింప బడుటయు వేదాంత పరిభాషతో సంస్కృత పదములను యుపయోగించకుండుటయు వేదాంత పండితులు అచల సిద్ధాంతమును మెట్ట వేదాంతముగా తలంచుటకు యొక కారణముగా కనబడు చున్నది. సామాన్య జనులకు సుబోధకమగు రీతిగా తెలుగు భాషయందు వ్రాయబడిన గ్రంధవిషయములు ప్రాముఖ్యతను తెలుసుకొనవలయునన్నచో భావార్ధము ప్రధానము, భాషప్రధానము కాజాలదు. సంస్కృత పదజాలమును యుపయోగించి వ్రాయబడిన గ్రంధములను కొద్దిమంది పండితులు మాత్రమే తెలుసుకునగలరు. సామాన్య జనులు తెలుసుకొనజాలరు. ఉదాహరణకు వేదాంత పరిభాష పదములగు ద్రష్టా, దృక్, దృశ్యములు, సంస్కృతమురాని సామాన్య జనులు వీనిని తెలుసుకొనజాలరు. శ్రీ భాగవత కృష్ణదేశికులు శుద్ధ నిర్గుణతత్వకందార్ధములలో వేదాంతపరిభాషా పదముల సంస్కృత నిర్వచనముల యొక్క భావమును తేట తెలుగు భాషయందు విశదీకరించిన తీరును తెలుసుకొనుటకై క్రిందికందార్ధమును గమనింపుడు.

కందార్ధము- "చూపులలోగల వస్తువు (ద్రష్టా) చూపులు గను వస్తువులును (దృశ్యము) చూపులు గూడన్ (దృక్) తేపకు యెరుకని తెలియుము చూపులు లేనట్టే బయలు చూచేదెంకేమి యెరుకే లేదు తోచేదెంకేమి? దీపామువలె కనుపాపాలో కనువస్తువే పరమాత్మని తెలిపితే యెరుకాయె చూచేదెంకేమి యెరుకేలేదు తోచేదెంకేమి." దృక్కు బ్రహ్మమని దృశ్యము మాయయని వేదాంతము చెప్పను. ద్రష్టా, దృశ్యము, దృక్కు యీ మూడును లేని యెరుకేయని పరబయలు కాదని, చూపులు లేనిదే పరిపూర్ణ పరబ్రహ్మయనిన్ని దీపామువలె కనుపాపాలో కనుబడునది పరమాత్మయని యంటే అది యెరుకయే కాని పరిపూర్ణ పరబ్రహ్మ కాదనిన్ని. పై కందార్ధములో తెలియ చేయబడినది. శృతి|| యత్ర నాన్యత్ పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యత్ విజానాతి సభూమా. ఈ విధముగా కందార్ధములలో వేదాంత విషయము వేదాంతాతీత విషయము కూడ తెలుపబడినది.

శ్రుతిస్మృతి నీతి శాస్త్రములలో సంస్కృత శ్లోకములను దృష్టియందుంచుకొని వ్రాయబడిన క్రింది కందార్థములను కంద పద్యములను గమనింపుడు.

శ్లో|| ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతద్ధ్యేవాక్షరం పరం
ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వాయోయదిచ్ఛతితత స్యతత్|| కఠోప.

శ్లో|| ఓమిత్యేకాక్షరంబ్రహ్మవ్యాహరన్ మామనుస్మరన్ |యః ప్రయాతి
త్యజన్ దేహం సయాతి పరమాంగతిం|| భగవద్గీత.

కందార్థము|| పంచాశదక్షరములు ప్రపంచము తానుద్భవించె ప్రణవాక్షరమందంచు శ్రుతులెన్నెదాన్నెరుకంచని నీవెరిగి యెరుగుమచలాముదినన్ నిల్వకు మెరుకనచలాములోనన్ x x x x

శ్లో|| యఏషసుప్తేషుజాగర్తి, కామం కామం పురుషోనిర్మిమాణః|
తదేవశుక్రం తద్బ్రహ్మతదేవామృతముచ్యతే| కఠోపనిషత్తు.

కందార్థ|| మరణ సుషుప్తులు జెందిన పురుషుడు మేల్కొనినవాడు భువితదితరుడౌ పురుషుడు కలగనువాడని యెరుగుండుము x x x x x x x యిరువురొక్కటె సుమ్మి తిరిగి పుదుదురు వీరే గురువుచే మేల్కొంటె తిరిగి పుట్టనే పుట్టడు.

శ్లో|| విద్యా వివాదాయ ధనం మదాయ శక్తిః పరేషాం
పరపీడనాయ ఖలస్యసాధోర్విపరీతమేతత్
జ్ఞానాయ దానాయ పరిరక్షణాయ.

క:- బలధన విద్యలు దుష్టుల కిలగలిగిన నొరుల నొంతురీర్షమునన్
బలధన విద్యలు శిష్టుల కిలగలిగిన నొరుల బ్రోతురెంతో,
మోదమున . . .

శ్లో|| అవిజ్ఞాతేపరే తత్వే శాస్త్రాధీతిస్తునిష్ఫలా
విజ్ఞాతేతు పరేతత్వే శాస్త్రాధీతిస్తునిష్ఫలా||

కందార్థ|| గూఢార్థమెరిగి సతతారూఢుండైనతడు గ్రంధరుచి గొనడు భువిన్ గాఢతరజ్ఞానంబున మూఢుండై యున్నవాడు మొదటికే వినడు + + +

శ్లో|| మనస్యన్యత్ వచస్యన్యత్ కర్మణ్యన్యత్ దురాత్మనాం
మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనాం

కంద|| మనసున నొకటి దలచు వాక్కున నొక్కటి బలుకుచుండు కుటిలుడు మరితా తనువున నొక్కటి జేయును వినువానికి బోధ తెల్ప విహితమటోయి||

కంద|| మనసున వాక్కున తనువున పని యొక్కటె జరుపునట్టి భక్తునికి దయన్ వినిపించుము వినుమని యీ ఘనబోధను వాని కతుక గలదుడుగకుమీ||

అచల సిద్ధాంతము మెట్ట వేదాంతము కాదని వేదాంతాతీత మని పై వివరణవల్ల తెలియబడగలదు. వేదాంతమునకును అచలసిద్ధాంతమునకునుగల భేదమును తెలుసుకొనజాలకయే అచల సిద్ధాంతమును మెట్ట వేదాంతమని విమర్శించినారు. ఇట్టి దుర్విమర్శలను విడనాడి అచల సిద్ధాంతమును గురించి తెలుసుకొనుటకు వారు ప్రయత్నించిన యెడల వారికే మేలు కలుగగలదు. వారికిగల దురభిప్రాయము, దురభిమానము తొలగగలదు.

# అచలసిద్ధాంతము - అస్పర్శయోగము

అస్పర్శయోగమనగా నేమి? స్పర్శయనగా స్పృశించుట; తాకుట; సంయోగము కలుగుట; పంచతన్మాత్రలనబడు శబ్దస్పర్శరూపరసగంధము లతో యింద్రియములకు సంయోగము కల్గినచో నదిస్పర్శ యనబడును. శ్లో|| మాత్రాస్పర్శాస్తు కౌంతేయ! శీతోష్ణ సుఖదుఃఖదాః | ఆగమాపా యినో Z నిత్యాస్తాంస్తి తీక్ష స్వభారత! || భ.గ. 2-14.శీతోష్ణములకు, సుఖదుఃఖములకు, పంచతన్మాత్రలే కారణములు.

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను విషయములు, యింద్రియము లకు ఆహారమువంటివి. శ్రోత్రము, త్వక్కు, చక్షుజిహ్వ, ఘ్రాణములను జ్ఞానేంద్రియములకు క్రమముగా శబ్ద స్పర్శరూపరస గంధములనునవి విషయ ములు. గనుక వీనిని విషయేంద్రియములందురు. శ్లో|| విషయావినివర్తంతే నిరాహారస్య దేహినః | రసవర్జం రసో ప్యస్య పరంద్రుష్ట్వా నివర్త తే| భ.గ.2-59. ఆహారములేని మానవునకు విషయములు తొలగును. కాని వానికి యందలి రసము అనగా కోరిక, మాత్రము తొలగదనే, పరమును దర్శించిన యెడల మాత్రమే కోరికకూడ తొలగుననీ పై శ్లోకముయొక్క తాత్పర్యము. ఆహారము తినకుండడమనగా అన్నము భుజింపకుండ డమని అర్థముకాదు. ఇంద్రియములకు శబ్దస్పర్శ రూపరసగంధములనే విషయములే ఆహారము. గనుక విషయానుభవము లేకుండుటే నిరాహార మనబడును. శ్లో|| కర్మేంద్రియాణి సంయమ్యయఆస్తే మనసాస్మరన్ |

యింద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారస్స ఉచ్య తే|| భ.గ. 3-6. కర్మేంద్రియములద్వార విషయభోగములను అనుభవించకుండినను మనసుతో యెవడు విషయములను స్మరించుచుండునో వాడు మిథ్యాచారుడనబడును. కేవలము బాహ్యాడంబరములు మిథ్యాచారము లనిపించును. గనుకనే తలలు బోడులైన తలపులు బోడులా విశ్వదాభిరామ వినురవేమ|| అని వేమన అన్నాడు.

ఇంద్రియ విషయములు విషముకన్నము చాలా భయంకరములైనవి. విషము యొక జన్మను అంతముచేయుగలదు. కాని యింద్రియ విషయములు పెక్కు జన్మలవరకు హానికల్గించుచుండును. శ్లో|| విషస్య విషయా నాంచదూర మత్యంతమంతరం ఉపభుక్తం విషంహన్తి విషయాస్మరణాదపి|| విషమును భుజించిన ప్రాణాపాయము కలుగును కాని, శబ్దాది విషయములను స్మరించినంతమాత్రాన, హానికలుగును శ్లో|| శబ్దాదిభిః పంచభిరేవ పంచపంచత్వమాప్నుః స్వగుణేనబద్ధాః | భుజంగ మాతంగ, పతంగ, మీన భృంగా, నరః పంచభిరంచితః కిం|| సర్పము, నాగస్వరముయొక్క శబ్దముచేత పట్టబడును. అడు యేనుగు యొక్క స్పర్శచేత మగయేనుగు లగడ్డయందు పడి మనష్యునకు వశమగును. పతంగము రూపతన్మాత్రయగు అగ్నిజ్వాలలో పడిచచ్చును. చేప గాలమునకు తగిలించబడిన మాంసముయొక్క రస లాలసత్వముచే నశించును. తుమ్మెద కమలముయొక్క రస లాలసత్వముచే చిక్కుకొనిపోవును. ఇట్లు యొక్కొక్క ప్రాణి, యొక్కొక్క తన్మాత్రచేత నశించుచుండగా, పంచతన్మాత్రలతో కూడికొనియున్న నరుని గురించి యేమి చెప్పవలయును? శ్లో|| యేహిసంస్పర్శజా భోగాదుఃఖ యోనయ ఏవతే ఆద్యం తవంతః కౌంతేయ, సతేషు రమతేబుధః|| భ.గ. 5-22. శబ్ద స్పర్శ రూప రస గంధములనే విషయ భోగములు దుఃఖదాయకములు ఆద్యంతవంతములు అనగా అనిత్యములుగాన బుద్ధి మంతుడగువాడు వానియందు దగులుకొనడు. శ్లో|| ఉత్థితానుత్థితానే తానింద్రియారీన్పునః పునః | హన్యాద్వివేక దణ్డేన వజ్రేణేవహరిర్గిరీన్ || (మహోపనిషత్తు) ఇంద్రుడు తన వజ్రాయుధముచేత పర్వతములను పడగొట్టు రీతిగా యింద్రియములను విషయాకారము బొంద కపూర్వమే అనగా విషయభోగమునకు పూర్వమే వివేకమనే గదచేత పునః పునః అణచివేయవలయునని వేదాంతము తెలుపుచున్నది.

శ్లో|| ఇంద్రియాణి పరాణ్యాహురింద్రి యేభ్యః పరమనః మనసస్తు పరాబుద్ధిర్యో బుద్దే పరతస్తుసః|| భ.గ. 3-42 ఇంద్రియములు బలమైనవి. వానిలో మనస్సు చాల బలవత్తరమైనది. మనస్సుకంటె బుద్ధి బలిష్టమైనది. సూక్ష్మమైనది. బుద్ధికంటెను ఆత్మసూక్ష్మాతి సూక్ష్మమని భగవద్గీత

బోధించుచున్నది. గనుక ఆత్మయే యింద్రియములద్వారా శబ్దాదివిషయము లను గ్రహించుచుండునని విదితమగును శబ్దాది విషయములతో ఆత్మకుగల గ్రాహ్య గ్రాహకసంబంధమే స్పర్శయనీ. యిట్టి గ్రాహ్యగ్రాహక సంబంధము లేకుండడమే అస్పర్శయోగమనీ యనబడును.

అస్పర్శయోగమెట్లు సిద్ధించును?

ఆత్మ యెరుక యొకటి లేకపోతే యింద్రియములు లేవు. విషయములు లేవు. ద్రష్టలేకపోతే దృశ్యములేదు. ద్రష్టయనునది యుంటేనే దృశ్యముం డును. కావున ద్రష్ట, దృక్కు, దృశ్యము యొకటేగాని వేరువేరుగాదని శ్రీ భాగవతుల కృష్ణదేశికేంద్రులు "చూపులలోగల వస్తువు చూపులుగను వస్తువులును, చూపులుగూడన్, తేపకు యెరుకని తెలియుము" అనే కందా ర్థమందు విశదపరచినారు. విషయగ్రాహకమగు ఆత్మయేభోక్తగాయున్నది. గనుక ఆత్మ, యింద్రియములు, విషయములు అవినాభావసంబంధముగలవి, ఇందు గ్రాహ్యమగు విషయములు మరుపు (మేను); గ్రాహకమగు ఆత్మ ఎరుకయని తెలియవలయును. సంకల్పాదిక గుణముల సంకులమీ యెరుక యందు సమకూడియుండును. "ఓమిత్యే కాక్షరం బ్రహ్మ" "శబ్దోవై బ్రహ్మ" యని సచ్చిదానందమే బ్రహ్మమని స్వప్రకాశమే బ్రహ్మయని 'రసోవైస:' యని విరాట్స్వరూపుడని విశ్వరూపుడని అనేక నామములు బ్రహ్మకుగలవు. అధిష్ఠాన బ్రహ్మము నందే సూక్ష్మముగా పంచతన్మాత్రలుండె అవియే పంచ తన్మాత్రలుగా స్థూలపరిణామము చెందినపుడు బ్రహ్మవేరని పంచతన్మాత్రలు వేరని భావించుటకు వీలు పడదు. గనుకనే మరుపుకు తన్మాత్రలు గలవు యెరుకకు తన్మాత్రలున్న వీరెండొకటేయని కృష్ణదాసుగారు శలవిచ్చినారు. గ్రాహ్యగ్రాహక సంబంధమునకు అధిష్ఠానబ్రహ్మమే ఆస్పదమైయున్నది.

"మేనెరుకల రెండింటిలో దానిని ఇది దీనినదియు తగ సృజి యించు చుండును" జగమువలన సంకల్పము జగమా సంకల్పమునను జనియించును, వేరగుపడదు జన్మమందిరము, అగుపడవెడబాసి నిల్వదా రెండెన్నటికె, "అన్నపు సూక్ష్మాంశము మనసెన్నగ నీరంబు ప్రాణము యీ రెండెన్నడు కలియవో నాడె నున్న సుమీ యెరుకమాట" కలసులె యెరుకయని ఆయా కందార్థముల భావార్థమును గురుముఖతః చక్కగా గ్రహించి సంకల్పాదిక గుణములు జాడలేనిది అచలమని, ధ్వని మొదలగు తన్మాత్రలు కనుగొనగా లేశమైన కాన్పించనిది బట్టబయలు అని. యెరుక మరుపుల కతీతమై నదే పరిపూర్ణమని, తెలిసి యిట్టి అచల పరిపూర్ణ పరబ్రహ్మను దర్శించి మూలములేని ఎరుక మరుపులను విడచి యుండుటచేతనే అస్పర్శయోగము సిద్ధించును ద్వైతాద్వైత విశిష్టా ద్వైతముల వలనకాని యేయితర సాంప్ర

దాయము వలన కాని, నిది సిద్ధింపదు. "ద్వితీయాద్వై భయంభవతి" యను శృతి ప్రమాణానుసారం ద్వైతమువలన భయముకలుగును. విష్ణువు లక్ష్మీదేవి, నారదుడు తుంబురుడు, గంధర్వులు, యక్షులు, కిన్నెరలు, కింపురుషులు, జీవులనే తారతమ్యములు మధ్వమతమందు, అల్లా సైతాన్, పైగంబరు, జీవులనే భేదములు, మహమ్మదీయ మతమునందును. దేవుడు, దేవుని కుమారుడు ఏసుక్రీస్తు, మరియు సామాన్య జీవులనె వ్యత్యాసములు బైబిలు మతమందును పేర్కొనబడెనవి. ఈ భేద దృష్టియే సవర్ణజాతులని, నిమ్నజాతులని: తెల్ల జాతియని, నల్లజాతియని ముస్లింలని, కాఫిర్లు అని, ముస్లిమేతరులని సృష్టించి పెక్కు అనర్థములను కల్గించుచున్నది భయభ్రాంతులకు కారణమగుచున్నది. అస్పర్శయోగమునకు నివి వ్యతిరేక లక్షణములు. గనుక ద్వైతము వలన అస్పర్శయోగము సిద్ధించనేరదను విషయము సుస్పష్టము.

"ఏక మేవా ద్వితీయంబ్రహ్మ, నేహనానాస్తి కించన" యను శృతి ప్రమాణసహితమైన అద్వైతమతమందు భేదభావమునకుఅవకాశములేదని యనుకున్నా అద్వైతమతస్థుల ఆచారవిచారములయందు భేదభావము కనబడుచునేయున్నది. వర్ణాశ్రమములను వీరు పాటించుచుందురు. శ్రీ శంకరాచార్యులు మ్లేచ్ఛుడనుకున్న వ్యక్తిని గచ్ఛగచ్ఛ (దూరము పొమ్ము) అనగానే మ్లేచ్ఛుని వేషమునవచ్చిన యీశ్వరుడు, శంకరునికి బ్రహ్మతత్త్వమును బోధించెనని చెప్పుకొనియెడి అద్వైతులు ఎందరు అట్టి తత్త్వోపదేశమ్మును పాటించి ఆచరించుచున్నారు. శ్రీ శంకరా చార్యులు స్థాపించిన పీఠములకు, బ్రాహ్మణులేకాని బ్రాహ్మణేతరులు అధికారులు కాజాలరు. బోధాధికారులు పురుషులేకాని స్త్రీలు కాజాలరు. ప్రణవమంత్రము సన్యాసాశ్రమము స్వీకరించిన యతీశ్వరులకే యుపదేశింపబడును గృహస్థులకు ప్రణవమంత్రము నుపదేశించుటకు వీలుపడదు. గృహస్థులకు గాయత్రిమంత్రము నుపదేశించెదరు. శంకరపీఠముల నధిష్ఠించిన జగద్గురువులే వర్ణాశ్రమములను పాటించుచుండగా సామాన్యుల విషయము చెప్పనవసరములేదు. అస్పర్శ యోగమువల్ల వీరలకాధిపత్యమే లేకుండబోవునని భయపడుచుందురు. శ్లో|| అస్పర్శయోగో వైనామ దుర్దర్శస్సర్వయోగిభిః । యోగినోబిభ్యతి హ్యస్మాదభయే భయదర్శినః || మాండుక్యోపనిషత్తు గౌడపాదకారిక అద్వైతసిద్ధాంతమందు యెరుకను విడిచేవిధానములేదు. గనుక ఎరుకనే పూనియుండడమువలన యేర్పాట్లు భేదభావములు, భయభీతములు, కలుగుచుండుట సహజమూ, ఒక్క అచల సిద్ధాంతముతప్ప అన్య సాంప్రదాయములలో అద్వైతమునకు సంబంధించినను లేక అద్వైతమునకు సంబంధించినవైయున్నను, యెరుకను నిలుపుచుండును. కాని అచల సిద్ధాంత మార్గమందు స్పర్శకు మూలకారణమగు యెరక

భ్రాంతి నుండి సాధకుడు విడిపించబడును. ఎరుకను విడచినవానికి యే ఏర్పాటు లుండవు గనుకనే "పాపములు పుణ్యములు భువిప్రాపించును." యెరకచేత భ్రమసినవారిన్ ప్రాపించ వెరుక నెడసిన తాపసులను చిత్తమందు తగదెలుసుగొను" మని శ్రీ భాగవత కృష్ణదేశికులు, చాటిచెప్పినారు. ఎరుక లేనిస్థితియందే శీతోష్ణములు సుఖదుఃఖములు శుభాశుభములు భయభీతులు, పాపపుణ్యములు, లేకుండును. అదియే అస్పర్శయోగము అస్పర్శయోగమే అచలసిద్ధాంతము.

# సత్పురుషులు సాంగత్యము

సత్యాసత్యములను తెలుసుకొనుటకు సత్పురుషుల సాంగత్యము చాల అవసరం, సత్యమగుదానిని దర్శింపచేసి అసత్యమగుదానిని తొలగింపజేయగ లిగినవారే సత్పురుషులు. ఇట్టి సత్పురుషుల సాంగత్యము సత్సాంగత్య మని సాధుసంగమమని సంతసమాగమమని చెప్పబడును. పశుతుల్యుడును, అజ్ఞానియునైన మానవునికి మానవత్వమును కల్గించి, జన్మరాహిత్యమును సిద్ధింపజేయునది సత్పురుషుల సాంగత్యము.

శ్లో|| మోక్షద్వారే ద్వారపాలాశ్చత్వారః పరికీర్తితాః
శమోవిచారః సంతోషశ్చతుర్థః సాధుసంగమః||

మోక్షద్వారమునకు - 1) శమము అనగా అంతరేంద్రియ నిగ్రహము 2) తత్వవిచారణ 3) సంతోషము అనగా చిత్తశాంతి 3) సాధు సంగమము అనగా సజ్జన సహవాసము అను యీ నాలుగు ద్వార పాలకులని చెప్ప బడును. ఇవి లేనిదే మోక్షద్వారము తెరువబడదు. అనగా మోక్షము సిద్ధించదని భావము. యీ నాలుగింటిలో యొకసత్సాంగత్యము లభించినను దానివలన మిగత మూడును లభింపగలవు. గనుక సత్పురుషుల సహవాసము చాల యుత్కృష్టమైనది. మోక్ష దాయకమైనది.

"ఏకం సత్ విప్రాః బహుధావదంతి" సత్యము నిత్యమునైనది యొకటి యైనను దానిని గూర్చి అనేకులు అనేకరీతులుగ చెప్పుకొనుచుందురు. శ్లో|| ఆశ్చర్యవత్పశ్యతి కశ్చి దేనమాశ్చర్య వద్వదతితథైవచాన్యః ఆశ్చర్యవచ్చైవ మన్యశ్శృణోతి శృత్వాప్యేనం వేదన చైవకశ్చిత్|| భ.గ. 2-29. సత్యము నిత్యము నైనదానిని యొకానొకడు ఆశ్చర్యమైన దానినిగా చూచుచున్నాడు. ఒకానొకడు అద్భుతమైనదానినిగా వర్ణించుచున్నాడు. మరియొకడు అట్లే విను చున్నాడు. అయినను పరతత్వమును తెలుసుకొనలేకపోవుతున్నాడు. గనుక జ్ఞానులు తత్వదర్శినులైన వారిని సేవించి ప్రశ్నించి తెలిసికొనవలసినదని

భగవద్గీత చెప్పుచున్నది. శ్లో|| తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ఉపదేక్ష్యంతితే జ్ఞానం జ్ఞానినస్తత్వదర్శినః|| భగ, 3-34. సద్గురు కరుణ లేనిదే విషయత్యాగము కలుగుట దుర్లభము. తత్వదర్శనముగానిదే సహజావస్థ కలుగడముదుర్లభము. విషయవిరక్తి, సమ్యక్ జ్ఞానము, మరియు సహజస్థితి గురుకృపలేనిదే లభింపవు. గనుక పరతత్వము తెలుసుకొన్నటు వంటె సద్గురువుల నాశ్రయించడమవసరము.

పరతత్వము తెలుసుకున్నవారు చాల అరుదు. అనేక వేలమంది మనుష్యులలో యొకానొకడు తన పూర్వజన్మ సుకృత పరిపాకముచేత నిత్యానిత్య వస్తువివేకముగలవాడై చిత్తశుద్ధిద్వారా జ్ఞానసముపార్జనకొరకు ప్రయత్నించుచుండును. అట్లు ప్రయత్నము చేయువారిలోకూడ యొకానొకడు యదార్థజ్ఞానమునుబొంది పరతత్వమును తెలుసుకొనుచున్నాడు. శ్లో|| మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే | యతతామపి సిద్ధానాం కశ్చిన్మాంవేత్తి తత్వతః|| భగ. 7-3. గనుక అట్టి మహనీయులు ఆశ్రయము లభించడము చాల దుర్లభము. శ్లో|| దుర్లభం త్రయమేవై తద్దేవానుగ్రహహేతకం. మనుష్యత్వం ముముక్షత్వం మహాపురుష సంశ్రయః|| విచూ. మనుష్యజన్మ లభించడము దుర్లభము. మనుష్యజన్మ లభించినను ముముక్షత్వము అనగా మోక్షజిజ్ఞాస పుట్టడ మతిదుర్లభము. ముముక్షత్వమునకు తగినట్లు మహాపురుషుల ఆశ్రయము లభించడము మహాదుర్లభము.

సత్పురుషులు సాంగత్యమువలన కలుగు లాభములు అసంఖ్యాకములు. గనుకనే సజ్జన సంగతి మక్కలి శ్లాఘింపబడినది.

శ్లో|| కల్పద్రుమః కల్పితమేవసూతే సాకామధుక్కామితమేవదోగ్ధి
చింతామణిశ్చింతితమేవదత్తే సతాంహిసంగః సకలం ప్రసూతే||

కల్పవృక్షము మానవుడు సంకల్పించిన వస్తువును మాత్రమే ప్రసాదించును. కామధేనువు కోరిన పదార్థములను మాత్రమే సిద్ధింప జేయును. చింతామణి చిత్తము చింతించినదానిని మాత్రమే ఇవ్వగలదు కాని సత్పురుషుల సాంగత్యము సకలమునివ్వగలదు. శ్లో|| జాడ్యం ధియోహరతి సించతి వాచిసత్యం | మానోన్నతిం దిశతి పాపమపాకరోతి చేతః ప్రసాదయతి దిక్షుతనోతికీర్తిం | సత్సంగతిః కథయకింనకరోతిపుంసాం|| సత్పురుషుల సాంగత్యము మానవుని బుద్ధిమాంద్యమును పోగొట్టును. వాక్కునకు సత్యము ప్రసాదించును. గొప్ప సన్మానమును లభింపజేయును. పాపములను పోగొట్టును. చిత్త మునకు ప్రశాంతత చేకూర్చును. నలుదిశలకు

కీర్తిని వ్యాపింపజేయును. సత్సాంగత్యము వలన మానవులకు చేకూరని దేమున్నది చెప్పుము. సర్వము చేకూరునని భావము.

సజ్జనసాంగత్యము సర్వానర్థములను నశింపజేయుగా, దుర్జన సాంగత్యము సర్వానర్థములను కల్గించుచుండును. గనుక దుర్జన సాంగత్యమును త్యజింపవలయును. శ్లో॥ దుర్జనేన సమం సఖ్యం ప్రీతిం చాపిన కారయేత్ । ఉష్ణోదహతిచాంగారః శీతః కృష్ణాయతేకరం ॥ అగ్ని ఉష్ణముగానున్నపుడు చేతిని దహించును. శీతలత్వము జెందినపుడు బొగ్గుగామారి చెయ్యిని నలుపుచేయును. అనగా మలినము జేయును. అట్లు దుర్జనసాంగత్యము సర్వకాలములందు అనర్థములను కలిగించుచుండును. గనుక దుర్జనసాంగత్యము తగదు. దుర్జనుడు విద్యావంతుడైనను వాడు సహవాసయోగ్యుడు కాజాలడు. సర్పముయొక్క ఫణయందు మణియున్నంతమాత్రాన అది భయంకరమైనది గాకుండునా? శ్లో॥ దుర్జనః పరిహర్తవ్యో విద్యాలంకృతోపిసన్ । మణినా భూషితః సర్పః కిమసౌన భయంకరః॥ శ్లో॥ ఆరంభగుర్వీక్షయిణీక్రమేణ లఘ్వీపురావృద్ధి మతీచపశ్చాత్ । దినస్యపూర్వార్ధ పరార్ధభిన్నా ఛాయేవమైత్రీఖల సజ్జనానాం ॥ ఉదయము సూర్యుని ప్రకాశము వలన యేర్పడు నీడ (ఛాయ) మొదట దీర్ఘముగా కనుపడి తర్వాత క్రమేణ యేరీతిగా క్షీణించుచుండునో ఆరీతిగా దుర్జనుని స్నేహము మొదట గొప్పగా నగుపడి తర్వాత క్షీణించుచుండును. ఇందుకు భిన్నంగా సజ్జనుని స్నేహము సాయంత్రపు నీడవలె క్రమేణ వృద్ధిజెందుచుండును కనుక సజ్జన దుర్జన సాంగత్యమును బాగుగా పరికించి చూడవలయును. పరీక్షించవలయును. శ్లో॥ దృశ్యన్తే భువిభూరినింబతరవః కుత్రాపితే చందనాః । పాషాణైః, పరిపూరితా వసుమతీ వజ్రోమణి ర్దుర్లభం । శ్రూయన్తేకరటారవాశ్చసతతం చైత్రేకుహూ కూజితం । తన్మన్యేఖిల సంకులం జగదిదం ద్విత్రాఃక్షితౌ సజ్జనాః॥ భూమియందు వేపచెట్లు అనేకచోట్ల కొల్లలుగా కనుపడుచుండను కాని చందనపుచెట్లు ఒకా నొకచోటమాత్రము అరుదుగా లభించును సర్వదా కాకులు రంతుచేయుగా వినబడుచుండును. కాని కోకిల గానము మాత్రము చైత్రమాసమందు వినబడును. వేషాడంబరములతో కపటవృత్తితో ప్రవర్తించుచుండెడి అధికసంఖ్యాకులమధ్య యీ జగత్తునందు యే కొద్దిమందిమాత్రమే సజ్జనులుందురు. అట్టి సజ్జనులను కనుగొనడ మతి కష్టమైనను వారి ఆచారవిచారములచేత కనుగొనవచ్చును.

శ్లో॥ చిత్తాహ్లాది వ్యసనవిముఖం శోక తాపాపనోది
యజ్ఞోత్పాది శ్రవణసుఖదం న్యాయమార్గానుయాయి
తథ్యం పథ్యం వ్యపగతమదం సార్థకం ముక్తవాదం
యోనిర్దోషం రచయతి వచస్తాం బుధాః సంతమాహుః॥

యెవడు ప్రసన్న చిత్తముగలవాడో, వ్యసనవిముఖుడో, శోకతాపములను శాంతింపచేసుకున్నవాడో, యజ్ఞాది కర్మలను జేయువాడో, శ్రవణానందము, న్యాయానుకూలము, సత్యము, హితకరము. మదరహితము, అర్థగర్భితము, వివాదరహితము, మరియు నిర్దోషమైన వచనములను యెవడు పలుకుచుం డునో అట్టివానిని బుధులు సత్పురుషుడని యందురు.

శ్లో || మనస్యన్యత్ వచస్యన్యత్ కర్మణ్యన్యత్ దురాత్మనాం
మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనాం||

దురాత్ముల మనస్సు వాక్కు కర్మభిన్నంగానుండును. మహాత్ముల మనస్సు వాక్కు కర్మ యేకంగానుండును.

శ్లో || విద్యావివాదాయ, ధనంమదాయ | శక్తిః పరేషాం పరపీడనాయ
ఖలస్యసాధోర్విపరీతమేతత్ | జ్ఞానాయ దానాయ పరిరక్షణాయ||

దుర్జనులకు విద్యయున్నచో వాదవివాదమునకు పూనుకొనెదరు ధనము న్నచో మదపూరితులగుదురు. బలమున్నచో పరులను పీడింతురు. సజ్జనులు యందుకు విపరీతముగా వ్యవహరింతురు. అనగా విద్యచేత జ్ఞానము సంపా దించెదరు. తమకుగల ధనమును దానమునకు యుపయోగింతురు. తమ బలముచేత యితరులను రక్షించెదరు. సజ్జన దుర్జనులకుగల యీభేదము యొకేయొక వాక్యములో చెప్పవచ్చును. "సాక్షరో విపరీతత్వే రాక్షసో భవతి ధ్రువం" గనుకనే "కలలోనైన దుష్టులచెంత జేరకు మెలమి శిష్టు లచెంత కలనైన వదలాకు" మని "అందమగు స్వాతి వర్షపుబిందుపు లెందెందుబడునొ పృధివిని తద్బిందువులుపాధివశమున జెందును తగునామ రూపచేష్టాదికమునూ అట్లనే నీవు జెందే విన్నియునూమందితో జతగూడి మాట్లాడినంతలో అందుకే సహవాసమరయూము తగుదాన్ని" యనిన్ని శ్రీ భాగవత కృష్ణదేశికులు కందార్థములలో హితోపదేశము గావించినారు.

# అచల సిద్ధాంతము - విమర్శనాజ్ఞానము

1. శ్లో ||అచ్ఛేద్యో యమదాహ్యో యమక్లేద్యో శోష్య ఏవచ
నిత్యః సర్వగతః స్థాణురచలో యం సనాతనః|| భగ. 2-24

అచలము నిరవయవము. అమూర్తము. అద్రవ్యము, గనుక శస్త్రము లచేత ఛేదింపబడరానిది, అగ్నిచేత దహింపబడరానిది, జలముచేత తడుపబ డరానిది, వాయువుచేత శోషింపబడరానిది, సర్వత్రస్థిరమైనది. చలించనిది. సనాతనమైనది.

2. సూక్ష్మాతి సూక్ష్మముగా నున్న ఆత్మ, స్థూలాతి స్థూలములుగా నున్న ఆకాశ వాయు అగ్నిజల పృథివి రూపములుగా పరిణమింప, ఈ చలనము, పరిణామము మొదలగునవి, ప్రకృతివేకాని. ఆత్మవి కాదని, ఆత్మ అవికారి, అవినాశి, అచలము, పుట్టని చావనిదని, సనాతనమైనదని, వేదాంతులు వచించుచుందురు.

3. "ఆత్మాతీతం కేవలాత్మ" అత్మకు అతీతమైనదే అచలమని పరిపూర్ణమని యెల్లకాలములయందును కదలక మెదలక యెట్టి పరిణామము జెందక, యొకేరీతిగా యుండునది యొక్క అచలమే యని ఆత్మ (ఎరుక) అచల పరిపూర్ణ పరబ్రహ్మమున యేకాలమందును లేనిదని లేకనే మరుమరీచికలవలె యున్నట్లు తోచుచున్నదని శ్రీ రాముడుగు శివరామ దీక్షితియు అచల సిద్ధాంతము చాటుచున్నది.

4. ఈ అచల సిద్ధాంతమందలి సత్యమును గ్రహించ జాలకయిది కేవలము మెట్ట వేదాంతమని శుష్క వేదాంతమని, వేదాంతవ్యతిరిక్త మని అనర్థ దాయకమని అభిమాన గ్రస్తులైన వేదాంతులు నిందించు చుందురు. అచల సిద్ధాంతము వేదాంతమునకు వ్యతిరేకము కాదు. అట్లని అచల సిద్ధాంతము వేదాంతము రెండు యొకటేనని కూడ అనరాదు.

5. అచల సిద్ధాంతమునకును, వేదాంతమునకుగల భేదమును తెలుసుకొనవలయునన్న విమర్శనాజ్ఞాన మవసరము. విమర్శనాజ్ఞానము కేవలము వేదాంతులకే కాదు, అచల సాంప్రదాయకులమని చెప్పుకొనెడివారికి కూడ అవసరము. ఎందుకనగా సాంప్రదాయక పద్ధతి కనుగుణ్యముగా అనగా శివరామదీక్షితీయ సిద్ధాంతానుసారముగా వస్తునిశ్చయపూర్వకముగా తెలుసుకొనకయే, పెక్కురు పెక్కురీతులుగా యీ అచల పరిపూర్ణ ప్రబోధను అర్థము చేసుకున్నారు. అచల సిద్ధాంతమునకును, అద్వైతమునకును భేదమే లేదని కొందరనుకున్నారు. ప్రాణాయామము ద్వారా సిద్ధించు నిస్సంకల్ప స్థితియే అచలమని కొందరు తలంతరు. అమనస్క యోగము వలన మనస్సు నాశనము కావడమే అచలమని కొందరన్నారు. జీవ బ్రహ్మైక్యమే అచలమని కొందరన్నారు. తత్త్వమస్యాది మహావాక్య నిర్ణయువద్వారా తన స్వస్వరూపమును గుర్తెరుగడమే **అచలమని,** అదియే పరమ లక్ష్యము, చరమ లక్ష్యమని, మరికొందరన్నారు. వారి వారి బుద్ధికి తో చినరీతివారు నిశ్చయించుకున్నారు.

శ్లో|| వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన
బహూశాఖాహ్యనంతాశ్చ బుద్ధయో వ్యవసాయినాం ||

భ.గ. 2-41

6. శ్రీ శివరామ దీక్షితీయ అచల సిద్ధాంతము వీనికన్నిటికి భిన్నంగా, మిన్నగా నున్నది. గనుకనే యీ అచల పరిపూర్ణ ప్రబోధను శ్రీమించు యచల బోధయని, తులలేని బోధయని తారమౌబోధయని, ఘనమైన బోధ యని, గురు గురుబోధయని, శ్రీభాగవత కృష్ణ దేశికులు వర్ణించినారు. మరియు యెందరిమాటలు యెన్నినయీ బోధక్రిందవేగాని పై కెక్కేవి గావని విశదపరచినారు. పరిపూర్ణ మెరుక ఆట్టిదో గురుముఖమున రెంటెని లెస్సగుర్తెరిగి, యెరిగిన యెరుక పరిపూర్ణమందు మృషయని తెలియజేసేదే, పరిశుద్ధ పరిపూర్ణప్రబోధయని, నిశ్చయ పూర్వకముగా తెలియచేసినారు.

7. అచల సిద్ధాంత వేదాంతముల తారతమ్యమును, సత్యా సత్యమును విదిత పరచుకొనకనే కేవలం పరిపూర్ణ ప్రబోధను శ్లాఘించుకోవడము సమం జసముకాదు. గనుక వేదాంతులు చేప్పే వాదనలో సత్యమెంతవరకున్నదో మొదట విచారింతము.

శ్లో || నైనంఛిందంతి శస్త్రాణి, నై నందహతి పావకః
నచైనం క్లేదయంత్యాపో, నశోషయతిమారుతః ||

ఆత్మను శస్త్రాదికములు ఛేదింప జాలవని, అగ్ని దహింప జాలదని, జలము తడపజాలదని, వాయువు శోషింపజాలదని కదా వేదాంతుల వాదన. కేవలము జడమైన శస్త్రము యేమియు చేయజాలదు. దేనినీ ఛేదింప జాలదు. అట్టి జడపదార్థములైన శస్త్రములు ఆత్మను ఛేదింప జాలవని వాదించడమే అర్థరహితము. శస్త్రాదికములు వాని అంతట అవి నరుకజా లవు. చైతన్యముగల పురుషుడు వానిని హస్తాదులయందు ధరించి ఛేదింప గలుగును. హస్త ములలోని చైతన్యము ఆత్మచైతన్యం వేరని చెప్పరాదు. ఆత్మ చైతన్యము వలననే శరీరముయొక్క అవయవములకు చైతన్యము కలుగును. గనుక హస్తాదులలోని చైతన్యము ఆత్మ చైతన్యము యొకటే. వేదాంతము యొక్క నిర్ణయముకూడయిదే.

శ్లో || యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున
నతదస్తి వినాయత్స్యాన్మయా భూతం చరాచరం||

సర్వభూతములకు స్థావర జంగమాత్మకమగు వస్తువులకు కారణ రూప మైనది ఆత్మ. దానికి తప్ప దేనికేని అస్తిత్వములేదు. ఛేదింపరానిది ఆత్మయే అని అర్థం చేప్పే పక్షంలో ఒక చైతన్యము ఇంకొక చైతన్యమును ఛేదింపజాలదని చెప్పటకూడ అసంగతమైన విషయమే, కాగలదు. చైతన్య స్వరూపమైన ఆత్మకు అతీతమైన అచలమును, యే చైతన్యముగాని, చైతన్య సహాయముతో శస్త్రాదికములు గాని ఛేదింపజాలవనియే పైశ్లోకమునకుసరైన

అర్థముకాగలదు. ఆత్మ వేరు, అచలము వేరని యిందువల్ల విదితము కాగలదు. అచలము సనాతనమైనదని ఆత్మ (యెరుక) మిథ్యా స్వరూపమని అచల సిద్ధాంత నిర్ణయము.

8. శ్లో|| నజాయతే మ్రియతే వాకదాచిన్నాయం భూత్వా భవితావాన భూయ అజోనిత్యః శాశ్వతో యం పురాణోనహన్యతే హన్యమానే శరీరే||

అచలము పుట్టదు, చావదు. ఒకప్పుడు యుండి మరియొకప్పుడు యుండకపోదు. అది నిత్యమైనది, శాశ్వితమైనది.

ఆత్మయే శాశ్వితమైనదని పుట్టని, చావనిదని వేదాంతులు చెప్పు దురు. కాని వీరి వేదాంతమే వీరి వాదనను అసత్యమైనదని రుజువు చేయుచున్నది. "ఏకోహంబహూస్యాం" ఏకముగానున్న ఆత్మకు అనేకము కావలయునని సంకల్పము, ఆత్మకు కలిగినందుననే కదా, ఈ జీవజగ త్తులు సృష్టి అయినవి? "తత్సృష్ట్వాతదేవాను ప్రావిశత్" జీవ జగత్తులను సృష్టించి ఆత్మ వానియందు ప్రవేశించినదని గదా శ్రుతి ప్రమాణము. ఇది ఆత్మకు జననముకాదా? "జాతస్య హిధ్రువోర్మృత్యుః" పుట్టినదానికి చావు నిశ్చయమనికూడ వేదాంతము చెప్పుచున్నది.

శ్లో|| అజో పిసన్నవ్యయాత్మా భూతానామీశ్వరో పిసన్
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా|| భగ. 4-6

పరమాత్మ తన స్వీయప్రకృతిని వశపరచుకొని తనమాయచేత అవత రించునని భగవద్గీత చెప్పుచున్నది. పై శ్రుతి ప్రమాణములు ఆత్మయొక్క జనన మరణముల నిరూపించు చుండగా ఆత్మ పుట్టని చావని అచల మని యెట్లు చెప్పనగును? "ప్రజ్ఞానంబ్రహ్మ" పరమాత్మజ్ఞానస్వరూపుడని ప్రజ్ఞానమే బ్రహ్మయని చెప్పుదురు. అయితే సత్వాత్ సంజాయతేజ్ఞానం" సత్వగుణమువలన జ్ఞాన స్వరూపుడగు పరమాత్మకు పుట్టుక కలదనియే చెప్పవలయును. ఈ జ్ఞానమునకే వ్యావహారిక సత్యత్వమని పారమార్థిక సత్యత్వమని రెండువిధములైన సత్యత్వములు కల్పింపబడినవి. జగద్వ్యవహార మును వ్యవహరించెడె జ్ఞానమునకు వ్యావహారిక సత్యత్వమేకాని పారమార్థిక సత్యత్వము లేదని వేదాంతులు చెప్పునపుడు జ్ఞానము యొకప్పుడుయుండి మరియొకప్పుడు లేనిదనియె కదా అర్థము! ఒకప్పుడు యుండి యింకొకప్పుడు లేనిది అచలమెట్లగును? సర్వదా సర్వత్ర స్వతసిద్ధమై యుండునదే అచలమని శ్రీ శివరామ దీక్షితియ అచల సిద్ధాంతము నొక్కి వక్కాణించుచున్నది. లేనెరుకను బయలందున లేనేలేదనక యితరులేల పలికిరో లేనిది కలదని పేదపను లేనేలేదనుచు సిగ్గులేక యీశిల ఛీవినకే చీకాకు నీ కేలయని శ్రీ భాగవత కృష్ణదేశికులు శలవిచ్చినారు.

9. "ఖంబ్రహ్మ" ఆకాశమే బ్రహ్మయని ఘటాకాశ, మఠాకాశ, మహాకాశములయందలి ఆకాశము ఏకమని అచలమని వేదాంత నిర్ణయము. ఈ నిర్ణయముకూడ సరైనదికాదు. ఆకాశము శబ్దగుణము గలది. కాని అచలము సగుణనిర్గుణాతీతమైనది. ఆకాశము గగనంశూన్యమని ఆకాశముయొక్క శబ్దార్ధము. ఆకాశము శూన్యమని యెప్పుడు లేనిదని చెప్పబడును. కావున ఆకాశస్థితమైన బ్రహ్మయెప్పుడూ లేని యెరుకయేకాని అచల పరిపూర్ణము కాదని సర్వకాలములయందు స్థిరముగా నున్నదే అచలమని తెలియనగును.

యెరుకాకాశము యేకమని, బయలు ఆకాశముకాదని, ఆవరణము ఆకాశమని, నిరావరణము అచలమని, యీరెండు వేరని, ఆవరణముననే నిరావరణమును జూచి ఆవరణమెడలిన ఆవలిమాట లేదనిన్ని, శ్రీ భాగవత కృష్ణయ్యగారు ఆయాకందార్ధములలో విశదీకరించినారు శ్రీ కృష్ణదేశికులు రచించిన శుద్ధ నిర్గుణ తత్వ కందార్ధాలు, పరమతత్వ కందపద్యాలు, చాల సుబోధకములుగాను సులభశైలిలోను యున్నవి. అచల సాంప్రదాయకులు ముముక్షువులు యెక్కవగా యీ గ్రంధమునే పఠించు చుందురు. ఈ గ్రంధమును చదివినవారికి కొంతవరకు అచల సిద్ధాంతము బోధపడగలదు. కాని యిందలి గూఢార్ధమును సాంప్రదాయిక గురువుల చేతనే తెలుసుకొనవలెను. విమర్శ నా జ్ఞానము లేనిచో గూఢార్ధము తెలియబడదు. గనుకనే శ్రీ భూమానంద హనుమంతరావు రాజయోగిగారు తాము రచించిన వాక్యత్రయ మను గ్రంధములో సందేహ నివర్త్యోపన్యాసం చివరిభాగమున "జ్ఞానములో అజ్ఞానముకూడ వున్నది. అటుగాక శుద్ధజ్ఞానము గలిగి దానిచే విమర్శజ్ఞానము గలిగి ఆపైన ప్రజ్ఞానము గలవాడే జనన మరణ రహితమైన విచారణకు అర్హుడు" అని శలవిచ్చినారు. కావున విమర్శనా జ్ఞానముచేత గురుముఖతః అచల పరిపూర్ణప్రబోధమును తెలుసుకొనిన యడల జన్మ మృత్యు పరంపరలనుండి తప్పక ముక్తి చేకూరగలదు.

శ్లో|| ఇతితేజ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా
మిమృశ్యైతద శేషేణ యధేచ్ఛసితథాకురు. భగ 18-63

గుహ్యాద్గుహ్యతరమైన భగవత్తత్వమును అర్జునునకు ప్రబోధించిన తర్వాత అందలి సత్యాసత్యములను సంపూర్తిగా విమర్శించి నీ యిచ్ఛ మేరకు ప్రవర్తించమని శ్రీ కృష్ణుడు అర్జునునితో చెప్పినట్లు భగవద్గీత పైశ్లోకము తెలుపుచున్నది. విమర్శనా జ్ఞానము గలవాడే సర్వగుహ్యతమమైన విచారణకు అధికారి కాగలడు.

శ్లో|| సర్వగుహ్యతమం భూయః శృణుమే పరమంవచః |
ఇష్టోఽసిమే దృఢమితితతో వక్ష్యామితేహితం|| భగ. 18-64.

జ్ఞానస్వరూపుడుగు శ్రీ గురుపరమాత్మయందు అచంచలమైన భక్తి శ్రద్ధలు కలిగియున్నపుడే విమర్శనాజ్ఞానము వెంపొందును గనుక భక్తిని గురించి భగవద్గీత పదే పదే బోధించుచున్నది.

శ్లో|| మన్మనాభవ మద్భక్తోమద్యాజీమాం నమస్కురు |
మామేవైష్యపి సత్యంతే ప్రతిజానే ప్రియో సిమే || భగ 18-65

శ్లో|| సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణం వ్రజ |
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః||
భగ. 18-66.

గురుపరమాత్మయందే మనస్సు లగ్నముజేసి భక్తి గలిగి గురుపరమాత్మనే పూజించి నమస్కరించుచుండుమని సర్వకర్మలను గురు పరమాత్మకు సమర్పణ జేసి అన్యదేవతా పూజలు మాని గురు పరమాత్మనొక్కనినే శరణు పొందుమని పై శ్లోకముల తాత్పర్యము.

శ్లో|| శ్రద్ధావాన్లభతే జ్ఞానం తత్పరః స్సంయతేంద్రియః |
జ్ఞానంలబ్ధ్వాపరాం శాంతిమచి రేణాధి గచ్ఛతి||

"శ్రద్ధాభక్తులుగలవాడే పారమార్థిక జ్ఞానమును పొందగలడు" అందుకే తెలియనివారికి తెలిసేది కఠినము తెలివిచే తెలిసితే తెలియ జేయును బోధ" యనిన్ని "మానవుడు చేయబూనిన దానిని లో తెరిగి చేయవలెనని మదిలో నే నెరిగి నీకు చెప్పితి పూనుము రుచిపుట్టదేని పోని నీ మనసు రుచి పుట్టితేపూను" మని శ్రీ భాగవత కృష్ణదేశికులు ఆయా కందార్థములలో విశదపరిచినారు.

విమర్శనా జ్ఞానముంటేనే పారమార్థిక తత్త్వ విచారణ యందురుచి పుట్టును. లేకున్న పుట్టదు. లోతుగా విచారించి చూస్తే యెరుక రాహిత్యమే జన్మరాహిత్యమని తెలియగలదు. యెరుక రాహిత్య మనగా నేననుదానియుండెట్టే భ్రాంతి లేకుండుట. అనగా అంతట నిండి నిబిడీ కృతమైన పరిపూర్ణమందు యీ గుర్తెరిగేశరీరమునకు మూలము లేదని, కనుక యిది మృషయని తెలుసుకొని, తెలిసిన తెలివిని విడిచియుండుట మతమతాంతరములలో నేను బ్రహ్మను (అహంబ్రహ్మాస్మి) నేను జీవుడను (అహం జీవః) అని చెప్పబడుచుండుటచే యేదో యొక రూపమున "నేను" అనుదాని భ్రాంతి యుండనే యుండును. ఈ భ్రాంతిస్థూల సూక్ష్మకారణ మహాకారణ శరీరములనంటి పెట్టుకొని అనుస్యూతముగా నుండును. నేనుమేనులు లేనిదే పరిపూర్ణ మని సాంప్రదాయిక గురువులచే తెలుసుకొని తెలిసిన తెలివిని అనగా యెరుకను మృషయని సరిపుచ్చుకొనుటచే యెరుక

భ్రాంతి నశించి జన్మరాహిత్యము సిద్ధించునని అన్యమార్గములచేత నిది సిద్ధించదని శ్రీ శివరామదీక్షితీయ అచల సిద్ధాంతము స్పష్టపరుచుచున్నది.

ఈ మూలములేని గుర్తెరిగే శరీరము శృతిస్మృతులలో "ఊర్ధ్వమూల మధఃశాఖ మశ్వత్థం" యని ఉపమాలంకారముచే వర్ణింప బడినది.

శ్లో|| ఊర్ధ్వమూలో అవాక్ శాఖ ఏషో ఽశ్వత్థసనాతనః
తదేవశుక్రం తద్బ్రహ్మతదేవామృతముచ్యతే
తస్మిన్ లో కాశ్రితాస్సర్వే తదునాత్యేతికశ్చన
కఠోపనిషత్తు 2-3-1.

శ్లో|| ఊర్ధ్వమూల మధఃశాఖ మశ్వత్థం ప్రాహురవ్యయం
ఛందాంసియస్యపర్ణాని యస్తం వేదసవేదవిత్

శాఖాపల్ల మములుగా విస్తరిల్లినది సంసారవృక్షమని అశ్వత్థవృక్షమని, యీసంసారమునకు ఊర్ధ్వమూలముగా నున్నది శుద్ధమని బ్రహ్మమని పై శృతి స్మృతులలో పేర్కొనబడినది. శ్వ-యనగా రేపు. అశ్వత్థ-అనగా యిప్పు డుకనుపడి రేపు కనబడినది. క్షణభంగుర మైనదియు సంసారవృక్షము. గనుక యిది అశ్వత్థవృక్షమని అభివర్ణింపబడినది.

శ్లో|| అధశ్చమూలాన్యను సంతతాని కర్మానుబంధిని మనుష్యలోకే

ఈ సంసార వృక్షముయొక్క వేర్లు పైనుండి క్రిందికి క్రిందినుండి పైకి ప్రాకిపోయినవి. శ్రీభాగవత కృష్ణదాసుగారుదీనినితొట్టిలు తొమ్మిదిగల మేన్మట్టి (మట్టివృక్షము) అని అభివర్ణించినారు. అన్ని వృక్షాదులకు వేర్లు క్రిందిభాగమున యుండగా యీ సంసార వృక్షమునకు మూలము ఊర్ధ్వ మున అనగా పైననున్నది. గనుక దీనిని తలక్రిందుగాబడ్డి తనువనికూడ వేరే కందార్థమందు సూచించినారు. ఊర్ధ్వమూలముగా నున్నది బ్రహ్మయని శాఖాపల్ల వములుగా అవ్యక్తాది స్థావరాంతము వరకు విస్తరించినది, యీ సంసార వృక్షమని, యీ సంసారవృక్షమును వైరాగ్యమనే శస్త్రముచేత ఛేదించి పరమ పదమును అన్వేషింపుమని, భగవద్గీత బోధించుచుది.

శ్లో|| అశ్వత్థమేనం సువిరూఢ మూలమసంగ శస్త్రేణదృఢేనఛిత్వా
తతః పదం తత్పరిమార్గితవ్యం||

గురుమంత్రమని యేటిగ్రుద్దాలితోటి యీయెరుక కూకటివేరు నెరిగి త్రవ్వ మని శ్రీభాగవత కృష్ణయ్యగారు ప్రబోధించినారు. గురుబోధానె గొడ్డలి చేబూని మట్టిపులుగుల రెంటిని మలచి కొట్టుమని యింకొక కందార్థ మందు నుడివినారు. ఊర్ధ్వమూలమనునది బ్రహ్మయని అది అవినాశియని దానినుండి వెలసిన శాఖాపల్లవరూపమైన సంసారవృక్షమని అదిఛేదింపతగిన

దని వేదాంతార్థము. ఈ సంసారవృక్షము సమూలంగా (కూకుదువేరుతో సహా) ఛేదింపతగినదని అచల సిద్ధాంతసారము. వేదాంతమునకును అచల సిద్ధాంతమునకును గల భేదము యిందువల్ల స్పష్టముకాగలదు.

5. ఊర్ధ్వమూలముగానున్న బ్రహ్మకారణము: శాఖాపల్లవములుగానున్న సంసారవృక్షము కార్యము. కార్యముతో పాటు కారణముకూడ రహితమైతే పరిపూర్ణము స్వతఃసిద్ధము. బ్రహ్మయెరుక, సంసారవృక్షము మరుపు, యెరుక మరవుల కతీతమైనదే పరిపూర్ణము.

కం|| ఎన్నోగ్రంధజలధులను
తిన్నగ మధియించిచూస్తె తేలెనుసారం
బున్నబయలు గని మృషయగు
నిన్నును నీమేను మృషని నిలువకు మనుచున్

పరిపూర్ణము, యెరుకనిర్ణయము, యెరుక నిరసనయనునీమూడు ముక్కలు అచలసిద్ధాంతమునకు ప్రాతిపదికలు. సాంప్రదాయక గురువులచేత వీనిని చక్కగా విమర్శించి తెలుసుకొనినయెడల తప్పక భ్రాంతిరహితము కాగలదు.

కందార్థము:- దానము ధర్మము సగుణధ్యానము ప్రతిమార్చనంబు తజ్ఞ పతీర్థ స్నానములివి ముక్తిదమని మానవులెంచ బయలు మాటాడదేమి యెరుకేలేదు, మాటాడదేమి. ఔను కాదనక నీవనక నేననకొక్క మేనై నతాగాక మితిమీరియున్నది; మాటాడదేమి: యెరుకలేదు; మాటాడదేమి.

# అచల సిద్ధాంత బోధక్రమము

కందార్థము:- హరికరనఖముఖ విదళిత కరిమస్తక గళితమైన ఘనమౌక్తికముల్ దొరికిన యెరుకలు గురుజలె ధరియింతురు రెంటివిలువ తమ రెరుగకనెకా! అట్లనె బోధక్రమ మెరుగకనెకా! పరిపూర్ణబోధను నెరిగింపు చుండిన | యెరుకాకే కొందరు మరిగేరి మార్గము తమరెరుగకనెకా| అట్లనె బోధ క్రమ మెరుగకనెకా |

శ్రీశివరామదీక్షితుల అచల సిద్ధాంతమే, సిద్ధాంతము. సాంప్రదాయక గురువుల ద్వారా అచల పరిపూర్ణ బోధక్రమ మెరిగినచో మాత్రమే యీ అచలసిద్ధాంతము తెలియనగును. ఉహపోహలచేత లేక అన్యమార్గములద్వారా యిది తెలియబడదు. యెరుక రహితము కాజాలదు. యెరుక రహితము కానిదే అచల పరిపూర్ణ స్థితి సిద్ధించదు. శ్రీశివరామ దీక్షితీయ అచల సిద్ధాంతమునకును అన్యమార్గములకును గల భేదము బోధక్రమ

మును యెరుగకనే కొందరు యెరుకయే పరిపూర్ణమని భ్రమించుచుందురు. కనుక బోధక్రమమెరుగుట చాల ముఖ్యము. యెరుక భ్రమకలిగిన శిష్యుని పరితాపము మాన్పునట్టి పండితుడే గురుడు. బయలెరుకలు శిష్యునకున్ దయతో నెరిగించి యెరుకను విడిపించు గురుడే గురుసార్వభౌముడు. గనుక గురు మంత్రముచే నిలువని యెరుకనే పరిపూర్ణ మనుచు నెరిగి నిరతమున్ యెరుక స్వరూపులైయున్న వారల తెరువును మాని పరిపూర్ణ గురువుల నాశ్రయించి వారిచే పరిపూర్ణ బోధయొక్క క్రమము నెరుగవలయును.

పరిపూర్ణ మనగా నేమి? యెరుక యనగా నేమి? యెరుక భ్రమయునగా నేమి?

పరిపూర్ణమువాఙ్మనస గోచరము అనగా వాక్కుచేత వచియింపరానిది. మనస్సుచేత యూహించరానిది. దృక్కున గోచరించనిది. కావున పరిపూర్ణ మిట్టి దట్టిదని చెప్పి చూపించుటకు యెవ్వరికిని సాధ్యము కాజాలదు. ఇది కేవలము గురుగోప్యము, గురుగుహ్యము, అనంతము, అద్వితీయము. దీనికి యింకొకటి సాటిలేదు. గనుక సూటిగా చెప్పుటకు సాధ్యపడుదు. అయితే యెరుక నెరుగనిది, యెరుక మీరినది, యెరుక మరుపులు లేని పరవస్తువు, పరిపూర్ణ మని చెప్పవచ్చును. దీనినే పరమపదము, బయలు, బట్టబయలు, అచలము స్థిరము, యని యందురు. పుట్టుట గిట్టుట లేకను, చట్టువలె కదలకుండు రాకడ పోకడ లేకను యేక స్థితియందుసనాతనమైన యీ పరిపూర్ణమే "నేననని బ్రహ్మ" యనిన్ని, నేనంచని నీవని యనని యనిన్ని శ్రీ భాగవత కృష్ణదేశికులు తాము రచించిన కందార్థములలో పేర్కొన్నారు. "కోహం" నేనెవ్వడనను జీవుడు. "సోహం" నేనే నేనను శివుడు. యీ రెండనకన్ తానుండు అచలము. గనుక కోహంకస్త్వం, తవదాసోహం, సోహంబని కూతలు కూసె, యెరుకచేత, యెరుక మరుపుల నెరుగని బయలును గని, యెరుక మరుపుల విడచుటయే, పరిపూర్ణ బోధక్రమము కావున యెరుక మరుపులననేమో విచారింతము.

ఎరుక యనగా యెరిగేటిది. తనను యితరులను సర్వమును యెరిగే జ్ఞానమే యెరుక. తనను మరచుట మరుపు, యనబడును. అనగా యెరుక యొక్క స్థానస్వరూప స్వభావములను తెలియకుండగ వ్యవహరించడమే మరుపులేక అజ్ఞానము. విద్యా విద్యలు, ఆత్మానాత్మలు దేహ దేహములు, నేను మేమలు యివి యెరుక మరుపులకు పర్యాయనామములు. స్థూల, సూక్ష్మ, కారణ మహాకారణ శరీరములని బోధ సౌలభ్యము కొరకు కల్పించబ డినవేకాని, వాస్తవమునా నాలుగు శరీరములు లేవు. మహాకారణ శరీరమగు గుర్తెరిగే శరీరమే యెరుక. మిగత మూడు శరీరాలు దాని అవస్థ మరుపు

యనబడును. మరుపన తొలిమేనులు మూడు యెరుకన నాల్గవ శరీరము ఈ రెండొకటే. పిండాండము, పిండాండము యొక్క అభిమాని జీవుడు, మరియు బ్రహ్మాండము, బ్రహ్మాండము యొక్క అభిమాని ఈశ్వరుడు ఈ ఖండములు నాలుగు గూడి, అఖండంబగు యెరుక ఇట్లు తెలిపిన వారె ఘనులు. పరిపూర్ణ గురువులు, సద్గురువులు వారే నిజగురువులు. ఈ అఖండ యెరుక యందు జీవశివైక్యమే మోక్షమని చెప్పెడి గురువులను మాయా గురువులని వేరే చెప్పనవసరము లేదు.

ఈ అఖండ యెరుకకు యెరుగుట, మరుపు జెందుట, సహజములు. ఈశ్వర భావము బొందినపుడు బ్రహ్మానందమనుభవించుట, జీవభావముచేత మిడుకుట, సృష్టికాలమందు ఆవిర్భవించుట, లేక ప్రకటమగుట, ప్రళయ మందు తిరోభావము జెందుట లేక, లయము జెందుట, మాయమగుట, యివి యెరుక యొక్క సహజ చేష్టలు.

కం|| ఒకచోటసవ్వడును, వేరొక చోటను మిడుకు చుందు,
యొకచోటనునే ప్రకట మగుదు, లేకుందును యొక
చోటను, యిట్టి చేష్టలుండును నాకున్||

యెరుగుట, మరుచుట, ప్రకట మగుట, మాయమగుట యనుకర్మను బట్టి, యెరుక కర్తయని, సుఖ దుఃఖములనుభవించుటను బట్టి యెరుక భోక్తయని, తెలియనగును. యెరుక మరుపుల కతీతమైన పరిపూర్ణము అకర్త, అభోక్త, (సుఖ దుఃఖములనెడి తిప్పలు లేనిది) యని దీనివల్ల విదితము కాగలదు.

కం|| యెరుగుట జ్ఞానము; దానను జరిగేపని కర్మయనుచు
జనులెన్నిరియీ యెరుకయు కర్మము లేనిదె పరిపూర్ణము,
వీటి నీవు పట్టకు మెపుడున్||

ఇట్లు అఖండ యెరుక యొక్క నిర్ణయము ద్వారా యెరుక మరుపుల నెరిగినవాడు జీవ శివుల భేదాభేదముల గురించి గాని, పురుష ప్రకృతుల తారతమ్యముల గురించి గాని, యితర సాంప్రదాయకులు చెప్పెడి గజి బిజి మాటలను గుజగుజలను గాని, చెవియొగ్గి వినడు మోసపోడు. ఈ యెరుకయే జ్ఞానము, జ్ఞానమేనేను, జ్ఞానము, నే; వేరటంచు గనబోకుము. ఈ జ్ఞానము వచ్చును పోవును. జ్ఞానాతీతమును (పరిపూర్ణమును) తాను గాంచిన దాకను, యిట్టి తిప్పల నొందుచుండును. జ్ఞానము స్వయంభూ అనగా తనకు తానే పుట్టుచుండును. మాయమగుచుండును. ఇట్టి యెరు కను యెరుగుటకు యింకొక యెరుక లేదు. ఇదే మూలములేని గుర్రైరిగే శరీరమనిన్ని, పరిపూర్ణ మందు యెరుక జొచ్చుటకుగాని, పరిపూర్ణము

నెరిగి యెరుక నిల్చుటకుగాని, స్థానము లేదు, కనుక యా మూలము లేని యా గుర్తెరిగే శరీర మేమియులేదని శ్రీశివరామ దీక్షితీయ అచల సిద్ధాంతము చాటుచున్నది.

నేననని బ్రహ్మయందు బ్రహ్మను నేననెడి మాయజగంబై ప్రబలినది. లేకనే తోచినది. నిరుపాధికమైన బయలులో తనువుతో వచ్చి, తనువుతో మాయమయ్యేది, జీవ జగత్తులవలెనే పరివర్తనము జెందేది, అశాశ్వతమైనది, యీ యెరుక. గనుక ఘనులు దీనిని నమ్మరుగాని కొందరు నరులు దీనినే పరిపూర్ణ పరబ్రహ్మయని, అచలమని, శాశ్వితమని, కొనియాడు చుందురు. దీపమువలె కను పాపలో కనువస్తువే పరమాత్మయని యందురు. ఆత్మను భవంబైనను ముక్తియని యందురు. తనను తాగనిన మోక్షమని యందురు. వన్నియులైదొక చోటను పన్నుగ గలసిన హృదయ పద్మమందు యెరుకున్న దని చెప్పెదురు. కన్నుల ప్రక్కన వ్రేళ్ళిడి భ్రూమధ్యమందు దృష్టినిలిపి అక్కడ వెన్నెలలో బయలున్నది కను మందురు. ఈ రీతిగా తనువు లోపల యున్న యెరుకనే పరిపూర్ణ పరబ్రహ్మమని భ్రమజెందుదురు. ఇత రులను భ్రమింప జేతురు. శ్రీభాగవత కృష్ణదేశికులు "నీకలలోని నన్నును లోకుల, లోకములజూచి" యను కందార్థములో దీనిని "లోపల భ్రమ" యని వర్ణించినారు. ఇదియే యెరుక భ్రాంతి. ఈ యెరుకనే భ్రాంతిని సుస్థిరము జేయుట కొరకు, ప్రాణాయామ విద్యా, పంచాగ్ని విద్యా, అంగుష్ఠ ప్రమితివిద్యా, మున్నగు విద్యలు కల్పింపబడినవి. ఇవి యన్నియు దేహముతో పొయ్యేటివి, యెరుకను నిల్పలేవు. శృతులందు, స్మృతులందు, యితిహాసములయందు సతతము శ్రమపడి వెదకిన యీ యెరుక నిల్వబోదు. నేననుచు ఎరిగె తను ఏందు లేక, అంతట. నిండినిబిడీకృతముగానున్న బయలును గాంచి, తను వాదికములను విడుచుట చేతనే, యెరుక భ్రాంతి రహితము కాగలదు. అమృతత్వము సిద్ధించ గలదు. ఇది నిశ్చయము నిస్సంశయము.

1) తనువులోపల గానవచ్చెడి హృదయస్థిత యెరుక యొకప్పుడు "అహం బ్రహ్మ" నేను బ్రహ్మనని, మరియొకప్పుడు "అహంజీవః" నేను జీవుడనని అంటున్నది. "స్వ" "పర" నేను పరులు అంటున్నది. శ్లో॥ క్షేత్రజ్ఞంచాపి మాంవిద్ధి సర్వక్షేత్రేషుభారత । అన్ని క్షేత్రములలో క్షేత్రజ్ఞ స్వరూపుడనై యున్నానని అంటున్నది.

శ్లో॥ ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జునతిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥

సర్వప్రాణుల హృదయాలలో నుండి వానిని తనమాయచేత భ్రమింపజే యుచున్నానని, నేను వేరు నామాయ వేరయని, అంటున్నది. "మమ మాయాదురత్యయా" నామాయ దాటశక్యముగానిదంటున్నది. "జ్ఞానం జ్ఞానవాతామహం" జ్ఞానులయొక్క జ్ఞానమేనేనంటున్నది. శ్లో|| శ్రేయో విజ్ఞాన మభ్యాసాత్. జ్ఞానాద్ధ్యానం విశిష్యతేధ్యానాత్కర్మఫలత్యా గస్త్యాగా చ్ఛాంతి రనంతరం|| అభ్యాసయోగమునకన్న జ్ఞానము శ్రేష్ఠమని, జ్ఞానముకన్న ధ్యానము శ్రేష్ఠమని, ధ్యానముకన్న కర్మఫల త్యాగమే శ్రేష్ఠమని, కర్మఫల త్యాగమే మోక్షమని చెప్పుచున్నది.

2) జీవభావముచేత నేను దాసుడను దాస దాస దాసాన దాసులకు దాసుడనంటున్నది. ఈ దాసభావమే ద్వైతసిద్ధాంతమును సృష్టించినది.

శ్లో|| మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః| జీవములు నా అంశమం టున్నది. శివుని ప్రీత్యర్థము నిష్కామ కర్మలు యజ్ఞాయాగాది క్రతువులను సలుపమంటున్నది. ఈ అంశభావమే విశిష్టాద్వైత సిద్ధాంతమును సృష్టించి నది.

"సోహం" "శివోహం" నేనే సర్వము. నాకన్యమైనది వేరేలేదని. జీవజ గత్తులు మాయయని, యంటున్నది. మహావాక్య శ్రవణాదుల వలన అద్వైత సిద్ధిని పొందమంటున్నది. ఇదియే అంశీభావము. ఈ అంశీభావమే అద్వైత సిద్ధాంతము.

వినునది, వినుపించునది, చూచునది, చూపించునది. చేయునది చేయించునది, యేకమేకాని అనేకము కాదు. ఏకమైన ఆత్మదేని కొరకు శ్రవణ మననాదులు చేయవలయును? తైలధారవలె దేనిని ధ్యానించ వలయును? ఏకమైన ఆత్మయే ఉత్తమ పురుష నిర్ణయమని ఉత్తమ పురుష నిర్ణయము కొరకు శ్రవణ మననాదులు చేయవలసిన అవసరములేదని అంటు న్నది. ఇదియే పురుషోత్తమ రూపవార్తిక సిద్ధాంతము.

3) ఇట్లు సిద్ధాంతముల సృష్టించి నానావిద్యలు విధానాలు కల్పించి కర్మ భక్తి జ్ఞాన వైరాగ్యముల ద్వారా మోక్షము పొందవచ్చునంటున్నది. దానము ధర్మము సగుణధ్యానము ప్రతిమార్చనంబు తజ్జపతీర్థస్నానములు ముక్తిదము లంటున్నది. ఏకాక్షరి (ఓం) యనుప్రణవ మంత్రమును పఠించమంటున్నది. చతుర్ాక్షరియగు "నారాయణ" మంత్రమును స్మరించుమంటున్నది పంచా క్షరి మంత్రమును (నమశ్శివాయ) మననము చేయుమంటున్నది. అష్టాక్షరి మంత్రమును (ఓంనమోనారాయణాయ) అనుష్ఠించమంటున్నది. ద్వాదశా క్షరి మంత్రము (ఓం నమోభగవతే వాసుదేవాయ) యిత్యాది మంత్ర ములను జపించమంటుంది. ఇవి యన్నియు యెరుక యొక్క నిర్ణయములే,

అన్నియు తానైతనకవిపన్నుగ వేరనుచు నోటసలుకుచు మరితానన్నిటి నెరిగే యెరుకై యున్నానని యెరుకే యెరుక నూహింపుచుండు తనలో తానె మోహింపుచుండును. చిత్రవిచిత్రాల కల్పించుచుండును. ఉన్నదానిని లేదనును. లేకున్నది గలదనును గనుకనే యీ యెరుక మాయలమల్లియని శ్రీభాగవత కృష్ణదేశికులు శెలవిచ్చినారు. దేహస్థితమైన యీ యెరుక భ్రాంతి తొలగనిదే దేహభ్రాంతిగాని జీవజగత్తుల భ్రాంతిగాని తొలగదు. అన్ని భ్రాంతులకు మూలభ్రాంతి యీ యెరుకయేగాన యీ యెరుకను రహితపరచి స్వ, పర. నేను పరులు అనుభావమును అభావము చేయునది అచల ప్రబోధ. అచల పరిపూర్ణ ప్రబోధచేత యెరుకభ్రాంతిని రహితపరుచు కున్నవారే భ్రమరహితులని, యితరులు భ్రమ సహితులని అచల సిద్ధాంత నిర్ణయము.

4) ఇంతవరకు దేహస్థిత యెరుక భ్రాంతి (ద్వైతభ్రాంతి) మరియు దానికి సాధనాంగముగానున్న కర్మ భ్రాంతిని గురించి చర్చించబడినది. ఈ జ్ఞానకర్మల భ్రాంతుల వలననే హృదయగ్రంధి ఏర్పడును. జ్ఞానవైరాగ్య భక్త్య సమానానదిస్నాన దేవమంత్రపఠన తద్ధ్యాన ముఖతంత్రములను పరమానిని రతికోరనట్టి కేవల భ్రాంతి రహితాసక్తులైన వారికే అచల సాంప్రదాయిక గురువులచేత పరిపూర్ణ బోధను తెలుసుకొని తద్వారా హృదయ గ్రంధిని విచ్ఛేద పర్చుకొనవీలగును. ఇతర పద్ధతుల ద్వారా హృదయగ్రంధి విచ్ఛేదము కాజాలదు.

5) పరిపూర్ణమును యెరుకను గురుముఖమున లెస్సగా గుర్తెరిగి యెరుక మృషయని సరిపుచ్చుకున్న పరిశుద్ధపు బోధ పరిపూర్ణ బోధయని శ్రీశివ రామ దీక్షితుల పద్ధతియిదియేయని తెలుసుకొనవలయును. అలభద్రాచలమనిన బయలుగా గుర్తెరిగి అందులతోచిన విష్ణువే (రాముడే) యెరుకయని నెరిగి గురునికృపచే విష్ణువనే యెరుక నిలువక యెగిరిపోతే అదే నిశ్చయమని, శ్రీభాగవతకృష్ణదాసుగారి నిశ్చయముకూడ యిదియేయని గ్రహించవలయును. శ్రీకృష్ణదాసుగారు రచించిన కందార్థములలోని గూఢార్థమును పరిపూర్ణ గురువులచేత చక్కగా గ్రహించినచో భ్రమపుట్టబోదని నిశ్చయపూర్వకముగా తెలియజేయబడినది. గనుకనే వీనిని జతనముగ దాచి చదువుకొనుమని వేమారు గరునినోట వినవలెనని గురునిపాదము పట్టిన భక్తులకు హెచ్చరిక చేయబడినది. ఏ పురుషుడు గురువర్యుని శ్రీపాదము పట్టలేదో యాతడు యీ బోధయందలి మర్మమును తెలుసుకొనజాలడు.

6) దేహము అసత్యము, దేహసత్యము, బ్రహ్మసత్యము, జగత్తు మిథ్యా. యని యితర సాంప్రదాయికులు చెప్పెదురు. దేహము మాయ అస

త్యమైనదని నిర్ణయించిన తర్వాత దేహమును ఆశ్రయించుకొనియున్న దేహిసత్యమెట్లగును? ఏక దేశీయమైన యీయెరుక అంతట గలదని యేరీతిగ చెప్పవీలగును? అంతటగల దొక్కఅచలమే. యెరుక అంతటగలదని అనరాదు వినరాదు. అదియేకాలమందులేదు. ఈ గుట్టు పరిపూర్ణ గురువులచే గట్టిగా తెలుసుకొనవలయును. తనువుతో వచ్చిన యెరుకే తనువును తనువనుచు తనను తానని యెరుగును తనువును బాసిన మీదట తనను ఆదేహమును రెంటిని తానెరుగదపుడు గనుక లేనేలెదెపుడు.

శ్లో॥ ఏతస్మాత్ కిమివేంద్ర జాలమపరం యద్గర్భగోళస్థితం।
రేతశ్చేతతి హస్తమస్తక పదప్రోద్భూతనానాంకురం।
పర్యాయేణ శిశుత్వ యవ్వన
జరావేషైరనే కైర్వృతం । పశ్యత్యత్తి శృణోతి
జిఘ్రతి తథా గచ్ఛ త్యథా గచ్ఛతి॥

జననీజనకుల శుక్లశోణితములు అచైతన్యములు కాని వీని వలన హస్త మస్తక పాదాది అవయవములతో తనువు యేర్పడి చైతన్య సహితమై శైశవము యవ్వనము వృద్ధాప్యము మున్నగు యవస్థలు బొందుచు చూచుచున్నది, తినుచున్నది, వినుచున్నది. ఆఘ్రాణించు చున్నది, పోవుచున్నది. వచ్చుచున్నది గదా! యిది యంతయు యింద్రజాలమువంటిది. ఇంతకు మించిన యింద్రజాలము వేరొకటి కలదా? పెనుమాయను జాడుము యిదె జనకుని జఠరంబు వలన జనని గర్భంబున జొచ్చి మారురూపమున జనియించునను కందార్థములో శ్రీకృష్ణదేశికులు పై భావమునే వ్యక్త పరచినారు. కావున దేహము దేహస్థిత యెరుక రెండును మాయయని అచల సిద్ధాంత నిర్ణయము.

7) తేజోబిందూపనిషత్తు, అసంతోపనిషత్తు మొదలగు వానిలో జీవజగత్తులు మాయయని నిరూపించుటకుగాను శశవిషాణవత్, రజ్జుసర్పవత్, ఆకాశపుష్పగంధవత్, గంధర్వనగరత్, వంధ్యాపుత్రవత్, నపుంసకపౌత్రవత్, మృగజలవత్, స్థాణుపురుషవత్, స్వప్నానందవత్, యిత్యాది యుదాహరణములెవ్వి యివ్వబడినవో అవియన్నియు నేననే బ్రహ్మ (యెరుక) యే మాయయని నిరూపించుటకు తగినవై యున్నవి. గనుకనే మృగజలమువలె నిజముగాదనుచు లోకులనేటే గజిబిజి వినుచు మానసమున వారిమాటకామోదించి దానికి యీ బోధకు తగునంచు వినజేస్తినని శ్రీకృష్ణదేశికులు విశదపరచినారు.

శ్లో॥ అన్తర్బహిః స్వంస్థిర జంగమేషు జ్ఞానాత్మనా ధారత యావిలోక్య ।
త్యక్తాఖిలో పాధిరఖండరూపః పూర్ణాత్మనాయః స్థితేఏష ముక్తః॥
వి.చూ. 339

స్థావర జంగమాత్మకమగు సర్వవస్తువుల యొక్క బాహ్యాభ్యంతరముల యందు వ్యాపించి సర్వాధారమై జ్ఞానస్వరూపమున తానైయున్నట్లు తనకు తానుచూచుచు సకలోపాధులను త్యజించి అఖండ పరిపూర్ణ స్వరూపమునుబొంది సుస్థితుడైయున్న పురుషుడు ముక్తుడని శ్రీ శంకరాచార్యుల వారి అద్వైతసిద్ధాంతము సిద్ధాంతీకరించగా; జ్ఞాన స్వరూపమైన తనకు పరిపూర్ణ పరబ్రహ్మమందు వునికియే లేదనిన్ని, మేనికి జగతికి లోపల వెలుపల లోపము లేక పరిపూర్ణమే నిండియున్నదని మేను జగత్తులు లేనివని అచల సిద్ధాంతము నిర్ణయించుచున్నది. కావున అద్వైతమునకును అచల సిద్ధాంతమునకుగల భేదమును గమనించి దేహిదేహముల కతీతమైనదే పరిపూర్ణ పరబ్రహ్మయని అదియే నిత్యమని సత్యమని గ్రహించవలయును. దేహమున కొంత నిజమని మోహంబున నిలుపుకొనుట మోసమగును గురుద్రోహమగును--

# కందార్థాలు కొన్ని సమన్వయార్థాలు

1. రాముడుగు వంశోద్భవులైన శ్రీ శివరామ దీక్షితులు సుజనుల కొరకై యెగజల్లిన అచల బోధను శ్రీ శివరామ దీక్షితీయ అచల సిద్ధాంతమనెదరు. ఈ అచల సిద్ధాంతమునకు సంబంధించిన గ్రంధము బృహద్వాశిష్ఠమను పేరుతో ఖ్యాతిగాంచినది. తత్వప్రబోధయందు జ్ఞానవాసిష్ఠమున్నగు వాశిష్ఠములకంటెను గొప్పది గనుక దీనికి బృహద్వాశిష్ఠమను పేరు సార్థకమైనది. ఇందులో 1 చలాచల వాక్యములనే భాగము 2. ద్వాదశీభావము అనే భాగము 3. షోడశీభావమనే భాగము 4. అచల బోధదృష్టాంతములను నాలుగు భాగములుగలవు. ఇది చాల పురాతనమైన గ్రంధము. ఇందలి గూఢార్థములను శ్రీ భాగవత కృష్ణ దేశికులు కందార్థ కందపద్యముల ద్వారా అతి సులభశైలిలో ప్రభోధించినారు. అచల బోధకు బందోబస్తు ( కట్టుదిట్టములు) గావించినారు. కందార్థ కందపద్యములయందలి గూఢార్థమును సాంప్రదాయిక గురువులచేతనే తెలుసుకొనవలసియుండును. శ్రీ భాగవత కృష్ణదేశికులు రచించిన యీ కందార్థములను శక్తిద్వయనిరాసకంబైన శుద్ధ నిర్గుణ తత్వ కందార్థములనియు, కందపద్యములను క్షరాక్షరోపాధి ద్వయదోష రహిత పరమ తత్వ కందములనియు నందురు. ఈ కందార్థ కందపద్యములలో గల కొన్ని వాక్యాలు పాఠకుల మనస్సుకు కలవరము కలుగజేయునట్టివిగా కన్పడుచున్నందున వీటిని గురించి విమర్శించిన యెడల అచల పరిపూర్ణ ప్రబోధ యొక్క సాంప్రదాయిక విశిష్ఠత తెలియగలదు. సందేహనివృత్తియు చేకూరగలదు.

2. సాధన సంపత్తియుగల సాధకుడొకడు ఘోరసంసారమునన్ బాధప డలేక తన పుణ్యోదయమున పరిపూర్ణ గురుని సన్నిధానమునకు పోయినట్లు మరియు శరణాగతుడైన యా శిష్యుని కరుణామృత దృష్టి చేతగాంచి యా భక్తునకు గురుడు పరిపూర్ణబోధచేసినట్లుగను కందార్థములయందు తెలియచేయబడినది. ఎటుబోచకేలు వెళ్ళి యిటుమిమ్ముచూచినప్పటి నుంచి దయచేసి యిప్పటిదాక బోధస్తే తీరెమత్ శంకాయని శిష్యుడు తనకై తాను గురుని చెంతకు చేరినట్లు ధృవపడుచున్నది. కంద పద్యములో కూడ ప్రథ మమున శిష్యుడు తనకు దావచ్చి సద్బోధను దెల్పుమటంచు మ్రొక్కు తన శిష్యునకున్ గురుడు వినజెప్పెనని యున్నది. కాని బోధానంతరము శిష్య విజ్ఞాపనలో " నా కొరకు కష్టపడితిరి మీకైమీరిటకు వచ్చి మిము బొగడుట కాకాకోదరేశుండు (ఆధిశేషుడు) చాలడు. ఆ కార్యము నాతరంబ అచల మనస్కా" యని గురువును శిష్యుడు స్తుతించిన కందపద్యములో గురుడు తనకుతానే వచ్చినట్లు వ్రాయుబడినది. ఈ కందార్థ కందపద్యము లలో గల పరస్పర విరుద్ధ భావమునకుగల కారణమేమి? విరుద్ధాంశములకు సమన్వయమేరీతి సంభవమగును?

3. శ్రీరాముడు వశిష్ఠ మహర్షిని తన యింటికే రప్పించుకొని బోధ తెలుసుకున్నట్లుగను, శ్రీకృష్ణుడు సాందీపిని మహర్షి యొక్క ఆశ్రమమునకు స్వతఃవెళ్ళి ఆ మహర్షి ద్వారా బోధను తెలుసుకున్నట్లుగను యితిహాసములు చెప్పుచున్నవి. శ్రీరాముడు మాయామానుష విగ్రహుడని (పురుషుడని) శ్రీకృష్ణుడు లీలామానుష విగ్రహుడని (పురుషుడని) పురుషోత్తముడని చెప్ప బడినది. శ్రీకృష్ణుడు సాందీపిని మహర్షి ద్వారా అట్టి అచల పరిపూర్ణబోధ తెలుసుకొన్నాడుగదా!

అచలబోధయొక్క యీ విశిష్ఠతవలన విలక్షణమైన ఆచరణ వలననే శ్రీకృష్ణావతారము దశావతారములలో పూర్ణావతారమని చెప్పబడుతున్నది. కావున శ్రీకృష్ణుడు తానురాజై కూడ భవనాశస్థితిలేని బోధపద్ధతి తాను పూర్ణగురువును అన్వేషించి ఆశ్రయించి బోధ తెలుసుకొనిన మార్గమే సర్వశ్రేయస్కరము, అవశ్యమవలంబనీయము ఇదియే స్థాన శుశ్రూషయొక్క నిజాభిప్రాయంకూడాయైవున్నది. "ఉత్తిష్ఠత జాగ్రత్త ప్రాప్యవరాన్ నిబోధత" యను శృతివాక్యము కూడ యీ పథమునే సూచించుచున్నది. గనుక జనన మరణ ప్రవాహ రూపమగు ఘోరసంసారమున బాధపడలేక శిష్యుడు తనకైతాను పూర్ణగురువుని చెంతకు చేరడమనే విషయమే సహజమైనది. సాంప్రదాయానుకూలముగ నున్నది. శిష్య విజ్ఞాపనలో శిష్యుడు గురువుని గూర్చి మీకైమీరిటకు వచ్చి నాకొరకు కష్టపడితిరియని స్తుతించడములో

గురువే శిష్యునితావుకు వచ్చినట్లు భావించడము సరికాదు ఏలననగా శిష్యుడు బోధానంతరము తన గురువును కారణజన్మునిగా భావించి స్తుతించుచున్నాడు. కారణ జన్ములైన మహాత్ములు పరిపూర్ణ గురువులు కర్మానుభవము కొరకుగాక కేవలము జీవుల నుద్ధరించుటకుగాను లోక సంగ్రహార్థము కొరకు తమకు తామె ప్రపంచమున జన్మించుచుందురు. దుష్టజన శిక్షణార్థము శిష్టజన పరిరక్షణార్థము ధర్మసంస్థాపనార్థము "సంభావామియుగేయుగే" ప్రతి యుగమందును ప్రపంచమున పుట్టుచుందును యని భగవద్గీతయందు గీతాచార్యుడు చెప్పిన భావముయిదే. బ్రహ్మాది దేవతలు రాక్షస సంహారముగావింపుమని ఎంతగానో ప్రార్థించిన పిమ్మటనే శ్రీమహావిష్ణువు అవతారములెత్తి దుష్టశిక్షణ శిష్టరక్షణ గావిస్తూ వచ్చినాడని పురాణములు చెప్పుచున్నవి. కాని తాము తరించియున్నను లోక సంగ్రహార్థము, యితరులను తరింపచేయుటకై భూమిపై జన్మించిన మహాపురుషులను కారణజన్ములనియందురు. వారినెవరును భూమిపై అవతరించుమని కోరనక్కరలేకనే వారంతటవారే అవతరింతురు. కనుకనే మీరైమీంటకు వచ్చి అనగా ప్రపంచమున మీయంతట మీరే జన్మించి నా కొరకు కష్టపడితిరి యని శిష్యుడు గురువును స్తుతించడములో కూడ యీ భావమే వ్యక్తమగుచున్నది. కావున గురువు తనకుతానె శిష్యుని తావుకు పోయినాడని అర్థము చెప్పకొనడము అసహజము, అసమంజసము, అసంప్రదాయికమూనగును.

4. ఎరుక జడమజడమీ జగమరయుగపరిపూర్ణ మేమియునరానిది యీ యెరుక జగములస్థిరములు పరిపూర్ణము శాశ్వతపుదియను కందార్థమందు యెరుక, పరిపూర్ణముల స్వరూపము నిరూపింపబడినది. వేదాంత పరిభాషయందుగల చిజ్జడము (చిత్తుజడము)ల భేదమును నిర్ణయము చేయు సందర్భమున యెరుక చిత్తు అనగా అజడమనియు జగము జడమనియు చెప్పవలయును. యెరుకనగా జ్ఞానము జ్ఞానమునిన, సంవిత్ అనిన, చిత్ అనిన చిత్ప్రకాశమనిన, నేననిన, ఆత్మయనిన యెరుకకే పర్యాయపదములు. యెరుక స్వయంప్రకాశముగలది గనుక తనకు తాను ప్రకాశించుచు దృశ్య జగత్తునంతటిని ప్రకాశింపజేయును జగము స్వయంగా ప్రకాశించునది కాదు. యెరుకచేత ప్రకాశింపబడును కావున జగము జడమనబడును. యెరుక అజడములేక చిత్తనబడును. కంద|| మేనుజడమజడమనినను నేనును యీ రెండుకలిపి నేనబడు స్వప్నానందమెమదవస్థగు నేనే నను మృషని తెలియనే మృషనౌదున్|| యను కందపద్యమందు నేను అజడమని మేను జడమని చెప్పబడినందున యెరుక అజడము జగము జడమనే అర్థమే స్పష్టముగ తెలియబడుచున్నది. అయితే కందార్థమందు యెరుక జడమని జగము అజడమని వ్రాయబడినట్లుగా స్థూలదృష్టికి గోచరించుచున్నది. కృష్ణ దేశికేంద్రులవారట్లు పొరబడినారని అనుకొనరాదు. పైన వుదహరించిన కందపద్యములలో

ఆయన ఎరుక అజడమనీ, జగము జడమనీ - సరిగా చెప్పనే చెప్పినారు. యిచ్చట ఎరుక జడాజడ రూపముగా నున్నదని మాత్రమే చెప్పినట్లు యెంచరాదు. "ఎరుక అజడమీజగ మరయగ పరిపూర్ణమేమియునరానిది" అన్నవిధముగా నిలువ గీతలు పెట్టిన చోట్లలో చదివినచో సరియైన అర్థము వచ్చును. కావున కందార్థమందు చిజ్జడముల వివేచన చేసి పరిపూర్ణము చిత్తుకాదు. జడముకాదని నిరూపింపబడినది. అందుకే ఎరుక మరియు జగము అస్థిరమనియు పరిపూర్ణము శాశ్వితమనియు విషదపరచబడినది.

1. ఆగమ నిగమోపనిషత్సాగర మధితార్థమెల్ల సాంగో పాంగముగా వినుపింతునని కందార్థ మందును మరియు సకల నిగమాద్రిప్రకర మహానా రికేళ ఫలసారముదిసి యొక గ్రంథము లౌకిక జనులకీడు తొలగుటకై చేసితినని కందపద్యమందును శ్రీభాగవత కృష్ణదేశికులు తెలియ జేసినారు. గనుక యీగ్రంథమున పెక్కు వేదాంత విషయములు చర్చించబడడమేగాక భ్రాంతి రహిత పద్ధతికూడ సూచింప బడినదని గ్రహింపవలయును.

2. కందార్థ కందపద్యములలో పేర్కొనబడిన జీవుడు, శివుడు (ఈశ్వరుడు) సాక్షి, చైతన్యము, బ్రహ్మజగత్తు, దేహి, దేహములు, దృక్, దృశ్యములు యెరుక మరుపులు జ్ఞానాజ్ఞానములు, విద్యావిద్యలు కలమేలు కలు, మున్నగు శబ్దములు వేదాంత సంబంధములైనవి కనుక వేదాంత పరిభాషలోనే వీని కర్థములు చెప్పవలసి యుండును. వేదాంత పరిచయము లేనిదే కందార్థ కందపద్యములయొక్క భావార్థము తెలియుట కష్టసా ధ్యము. నేను మేనుల (దేహి దేహములు) యెరుక మరుపుల యొక్క శరీరములను విచారించి తెలుసుకొనవలెను. ఇత్యాది వేదాంత విషయాలు పీఠ గ్రంథములగు భద్రాది రామశతకము అచల పరిపూర్ణ రాజయోగీయము పరిపూర్ణ దర్శనమను ఉద్గ్రంథములలో విపులముగా వ్రాయబడినవి. అవి అవశ్యంపఠనీయములు.

3. ఆత్మానాత్మలు దేహిదేహములు జ్ఞానా జ్ఞానములు యెరుక మరు పులులలో యొకటి కారణ రూపముగాను రెండవది కార్యరూపముగా నున్నది. కారణ రూపముగా నున్నదే స్వప్రకాశబ్రహ్మ. అదేసాక్షి. అది స్వయముగా ప్రకాశించుచు యితరములను ప్రకాశింపజేయును. కాని అది యితర ప్రకాశములను అపేక్షింపదు. గనుక స్వప్రకాశబ్రహ్మ యనబడును. అది దేహములో బుద్ధికి సాక్షిగా నుండి సర్వమును చూచుచుండును. గాని దానికి వేరే మరియొక సాక్షిలేదు. కనుక అది సాక్షి యనబడెను. అది బుద్ధ్యాది సకల జడపదార్థములకు చైతన్యము కలిగించు చున్నది. దాని

సాన్నిధ్యమాత్రమున దేహేంద్రియ మనో బుద్ధులు వాని వాని వ్యాపారము లయందు అనగా విషయములయందు ప్రవర్తింప సమర్థములగు చున్నవి. గనుక అది చైతన్య మనబడును. ఈ చైతన్యమే ఉపాధి భేదముచేత ఈశ్వరుడు యని జీవుడని చెప్పబడును. ఈశ్వరునకు, మహత్తు మొదలు పంచభూత పర్యంతముగల సమస్తమునకు కారణమగు మాయయే ఉపాధి. జీవునకు కార్యమగు అవిద్యాకల్పిత పంచకోశములు ఉపాధి. " నేతి నేతి " యనెడి శృతివాక్యముచేత జీవేశ్వరుల యొక్క అవిద్యామాయల నెడు ఉపాధులను వాని కార్యములను నిరసింపగా జీవేశ్వరుల భేదము నశించి కేవలము ఒక్కటైన చైతన్యము శేషించి యుండును. ఇదియే జీవ శివైక్యము. కారణ రూపమైన మట్టినుండి యెట్లు ఘటము వేరుగాలేదో అట్లెనామరూపాదికములుగల జగత్తు కారణరూపమగు బ్రహ్మ నుండి వేరు గాలేదు. అజ్ఞానము వలన యీ జగత్తునానారూపములుగ ప్రతీతమగు చున్నదే కాని జ్ఞాన దశయందు ఆయా నామరూపములు స్ఫురించక కేవలము అధిష్ఠాన బ్రహ్మ మాత్రము స్ఫురించు చుండును. ఇదియే సర్వం ఖల్విదం బ్రహ్మయను శృతివాక్యము యొక్క తాత్పర్యము. తత్వ మస్యాది మహావాక్యముల యొక్క వాచార్థ లక్ష్యార్థములను భాగత్యాగ పద్ధతిచే విమ ర్శించి "నాహంజీవః" నేను జీవుడను కాను "అహం బ్రహ్మాస్మి" నేను పరబ్రహ్మ స్వరూపుడను శుద్ధ జ్ఞానస్వరూపుడనని ఆనంద స్వరూపుడనని సాక్షిమాత్రుడనని తెలుసుకొని ఆత్మానుభూతిని పొందడమే వేదాంత మందు మోక్షమనబడును ఇదియే జ్ఞేయ మనబడును.

4. వేదాంత మందు యేది జ్ఞేయమో, మోక్షమో అదియే అచల సిద్ధాంతమందు యెరుకయని తెలియువలయును. ఎరుకే యిహపర సౌఖ్య ములు యెరుకే జ్ఞానంబు జ్ఞేయము. యెరుకే మోక్షము. యెరుకే భక్తి, విరక్తి (వైరాగ్యము) యెరుకే సంకల్పము యెరుకే జీవుండు యెరుకే ఈశుడు ( ఈశ్వరుడు) యెరుకే జీవేశ్వరైక్యత యని శ్రీకృష్ణ దేశికులు శల విచ్చినారు. ఎరుకే విద్యావిద్యలు యెరుకే, ప్రణవంబు యెరుకే, కళ యెరుకే, బిందువు సత్తుచిత్తు ఆనందము ( సచ్చిదానందము) యెరుకే, నిర్గుణము యెరుకే, సగుణము యెరుకే యనిన్నిసాక్షియని, ద్రష్టయని, అహంయని, దేహియని, జ్ఞప్తియని, స్ఫురణయని బుద్ధ్యని, చిత్తంబని, మానసమని, అహంకారమని, అంతఃకరణ యనిన్ని యెరుక యొక్క పేర్లు వివరించ బడినవి.

5. జ్ఞానా జ్ఞానంబుల కతీతమైనది, అన్యమైనది, అనగా యెరుకకా నిది, యెరకలేనిది, యెరుక నెరుగనిది, యెరుక మీరినది, అచల పరిపూర్ణ పరబ్రహ్మయని యిదియే జ్ఞేయమని అచల సిద్ధాంత నిర్ణయము. కం||

జ్ఞానమగు నీవు జ్ఞేయం | బైన బయలుగాంచి జ్ఞానమగు నిను నీవే లేనంచు దెలియుమని తానా నరునకు వాసుదేవుడానతియిచ్చెన్'' ఎరుకేయిహపర సౌఖ్యములమ కందార్థములోని జ్ఞేయశబ్దము పై కందపద్యములోని జ్ఞేయ శబ్దము యొక్క వాచ్యార్థమొకటె అయినప్పటికి యీ రెండు శబ్దముల యొక్క లక్ష్యార్థము వేరుగా నున్నది. కందార్థములోని జ్ఞేయ శబ్దము యెరుక నిర్దేశకము. కందపద్యములోని జ్ఞేయ శబ్దము పరిపూర్ణ సూచకమని తెలియ వలయును. ఇదే రీతిగా మోక్షశబ్దము యొక్క వేదాంతార్థము అచల భావార్థము తెలియనగును.

6. పరిపూర్ణము యెరుకలను గురుముఖమున లెస్సగా విచారించి తెలుసుకొన వలయును. ఎరుక పరిపూర్ణములలో ఎరుక కలతోను పరి పూర్ణము మేలుకతోను పోల్చబడినవి. కలమృష, మేలుక సత్యము అను లోకుల వ్యవహారము ననుసరించి దృష్టాంత మీయబడినదేగాని వేరుగాదు. నేనంచనినీవని యననిది, స్వతఃసిద్ధమైనది, నిత్యమైనది, సత్యమైనది, పరి పూర్ణము. అట్టి పరిపూర్ణ పరబ్రహ్మమందునేనను ఎరుక లేకనే తోచినది. కనుక నేను కల, నా వ్యవహారము కల విశ్వముకల.

నను మిమునేగని పుస్తకమును దీన్ని మీరు విను మనుటయు, నను మీరు వినుపించు మనుటయు కల. ఇట్టి కలకు ఘనమైన పరిపూర్ణ బోధయే మేలుక. మేలుకతో కలలేక పోవుననీ కందార్థమందు శ్రీకృష్ణదాసుగారు తెలియజేసినారు. ఇదియే గురుమేల్క ఈ కల కందములను వినుడు ఓ కల నరులార మీకు యొప్పిదమైనన్, నేకల గనుక రచించితి ఆ కల మోక్షమును జెందనగు నివివినినన్'' యని కందపద్య మందును యీ భావమే విదిత పర్చబడినది. గనుక కందార్ధ కందపద్యములలోని జ్ఞేయము, మోక్షము, కల, మేలుక, గురు మేలుక యను శబ్దములకు వేదాం తార్థము అచల భావార్థములను గురుముఖతః వస్తునిశ్చయ పూర్వకముగా తెలుసుకొని వాచ్యార్థ, లక్ష్యార్థములలో యేది యెచ్చట ప్రయోగింపబడినదో తెలుసుకొన్నగాని కందార్థముల నిజాభిప్రాయము గోచరింపదు.

# రెండవ గురువెవరు?

గురు గురు బోధలచేత అచల పరిపూర్ణబోధ తెలుసుకొన వీలగును. సందేహ నివృత్తియు, భ్రాంతి రహితమును గానంతవరకు పెక్కు గురువుల నాశ్రయించవలసి వుండును. పూర్వము, జనక చక్రవర్తి మొదలగు మహా ప్రజ్ఞావంతులు గూడ యెందరో గురువుల నాశ్రయించి, భ్రాంతి రహిత విధానమును తెలుసుకొనగల్గినారని పూర్వగ్రంథముల ద్వారా తెలియుచున్నది.

శ్లో|| మధులుబ్ధోయధాభృంగః పుష్పాత్ పుష్పాంతరం వ్రజేత్|
జ్ఞానలుబ్ధస్తథా శిష్యో, గురోర్గుర్వంతరం వ్రజేత్||

జ్ఞానమునందాసక్తిగల శిష్యుడొక గురువునుండి వేరొక గురువును, ఆత్మ సంతృప్తి, సందేహనివృత్తి కలుగునంతవరకు ఆశ్రయించుచుండునని పై గురు గీతా శ్లోకము చెప్పుచున్నది.

శ్రీ భాగవతుల కృష్ణదేశికులు రచించిన కందార్థ కందపద్యములలో కం|| గురుశిష్యుల లక్షణములు, గురుశిష్యుల బోధరీతి, గురు గీతార్థం బెరిగిన నరునకె మెప్పగు, యెరుగని యా దుష్టనరుని కేష్టతయౌనా?|| అని గురుగీతార్థము యొక్క ప్రాముఖ్యతను శ్రీకృష్ణదాసుగారు నొక్కి వక్కాణించినారు.

మరిన్ని పరిపూర్ణబోధ నెరుగని గురు శిష్యులు బోధకొరకు యింకొక గురువర్యుని, కోరపనిబడునని శ్రీకృష్ణదేశికులు శెలవిచ్చియే యున్నారు. కోరపనిబడును అనగా తప్పనిసరిగా కోరవలసి వుండును అని భావము.

ఐతే పరిపూర్ణ గురువుల చెంతజేరిన తర్వాత, గురుడు పరిపూర్ణ బోధనెరిగించుచున్ననూ, కొందరు బోధక్రమమెరుంగజాలక యెరుకకే మరు గుదురు. పరిపూర్ణ గురువుల త్యజించి యెరుక విషయమునే బోధించు గురువులను కొల్చుటకు దిగజారి పోదురు. పరిపూర్ణబోధనుండే మరల యెరుక స్తితిలోనికి దిగజారిపోయిన వారికి, యెరుక మహాత్మ్యముచేత నిస్సంశయముగ నరకం ప్రాప్తించును. అట్టి నరులను గురించి శ్రీకృష్ణ దేశికులు కందార్థం "గురుడు నరుడనుచు దలచిన, గురుమంత్రము మరి చియున్న, గురుపుత్రుల నాదరణ యొనర్పకయుండిన, గురువును విడనాడి రెండో గురుని చేరినను సద్గురుబోధ నెరిగి దూరినను" నరకము తప్పద న్నారు. కనుక గురువును విడనాడి రెండో గురుని చేరిననూ అనగా- పరిపూర్ణబోధ తెలుపుటకు సమర్థుడైన గురువు వుత్తమోత్తముడు. యితర సాంప్రదాయక (యెరుక మాత్రము వరకె బోధించు) గురువు పరిపూర్ణ బోధ బోధించు గురువునకు అన్యుడు కనుకను మరియు ద్వితీయ శ్రేణికి చెందినవాడు గనుకనూ రెండవ గరుడనగా పరిపూర్ణబోధ చెప్పని యితర సాంప్రదాయక గురువని అర్థమేగాని పరిపూర్ణ బోధనెర్గిన మరొక గురు వుకాదు అని గ్రహించవలెను. కనుక పరిపూర్ణ బోధ ఆమూలాగ్రముగా తెలియువరకు యెందరు పూర్ణ బోధ గురువులనైన ఆశ్రయించవచ్చును. తప్పక నాశ్రయించవలయును అని సిద్ధాంతం.

# స్వచ్ఛంద గురువులు - స్వచ్ఛంద శిష్యులు

స్వచ్ఛంద మనగా స్వతంత్రమని యర్థము. పరులచేత నియోగింపబడక తమకు తామే స్వతంత్రముగా యొకానొక సేవకొరకు యుపక్రమించినవారిని స్వచ్ఛంద సేవకులని (Volunteers) చెప్పెదరు. స్వచ్ఛంద శిష్యుడనగా యొకానొక గురువు తనను శిష్యునిగా స్వీకరించకున్నను లేక స్వీకరించ నిరాకరించినను తనకుతానే స్వతంత్రముగా ఆ గురువునకు శిష్యుడనని భావించుకొని ఆచరించువాడు స్వచ్ఛంద శిష్యుడనబడును.

స్వచ్ఛంద శిష్యునికి సంబంధించి మహాభారతమందు ఏకలవ్యునిగాథ ప్రఖ్యాతి గాంచినది. మట్టిబొమ్మయందు గురుభావనయుంచిన మాత్రమున ఏకలవ్యునికి గొప్ప సామర్థ్యము లభించగలిగినదని యీ కథ వలన విదితమగును. కనుకనే శ్లో॥ దేవేతీర్థే, ద్విజే, మంత్రే, దైవజ్ఞే, భేషజే, గురౌ। యాదృశీ భావనాయస్యసిద్ధిర్భవతితాదృశీ॥ యని చెప్పబడినది. దేవుని యందు, పుణ్యతీర్థములయందు, బ్రాహ్మణులయందు, మంత్రములయందు, జ్యోతిష పండితులయందు, వైద్యులయందు, మరియు గురువులయందు యెవనికి యెట్టి భావనయుండునో వానికి అట్టి ఫలము సిద్ధించునని పైశ్లోకము యొక్క భావార్థము. పై చెప్పబడిన కథవలన ఏకలవ్యుడు గురుభక్తులయందు ప్రశంసాపాత్రుడైనాడు. ద్రోణాచార్యులు తన భక్తుడైన ఏకలవ్యునివంచించి నందులకు శిష్య వంచకుడయినాడు.

ఏకలవ్యుడు, ద్రోణాచార్యులను, కౌరవపాండవులకు విలువిద్యను నేర్పుచుండ ప్రత్యక్షముగా దర్శించి ద్రోణాచార్యుల వారి మూర్తిని తన హృదయఫలకమున చిత్రించుకొని విగ్రహమునకు రూపకల్పన గావించుకొనెను. ద్రోణాచార్యులవారి శిక్షణాక్రమమును కూడచూచి యున్నందున ఏకలవ్యునికి విలువిద్యాసాధన యందు మార్గము సుగమమాయెను. అన్నింటికి మించిన గురుభక్తి ప్రభావము తోడయినందున ఏకలవ్యుడు గురుదత్తపుత్రుడు కాకపోయినను, గొప్పసామర్థ్యము సంపాదించగలిగెను. అయితే చూపించచూపరానిది పరిపూర్ణము గనుక అట్టి పరిపూర్ణ ప్రబోధయందు కేవలము గురుదర్శనముచేత స్వచ్ఛంద శిష్యుడై యేమియు సాధించజాలడు. పరిపూర్ణము గురుగోప్యము. గురుకృపలేనిదే గురుముఖమున విచారించి తెలుసుకొననిదే యిది తెలియబడజాలదు. వేమూరు గురునినోట విని పరిపూర్ణమెరుక లెట్టివో గురుముఖమున రెంటె లెస్స గుర్తెరిగి యెరుక మృషయని సరిపుచ్చుకొనజేయు పరిశుద్ధ ప్రబోధ శ్రీశివరామ దీక్షితులవారి పరిపూర్ణ ప్రబోధ. అంతేగాదు ద్వాదశీషోడశి మంత్రముల ( జ్ఞానకర్మల) మర్మమెరిగిన గురువుల చెంతనుండి కర్మాచరణ పద్ధతి నెరుగవలయునని

యీ అచలపరిపూర్ణ ప్రబోధ తెలియజేయుచున్నది. కావున గురుదత్తపుత్రులు గురుకృపా పాత్రులునైన శిష్యులకే యీ ప్రబోధపట్టుబడగలదు. కాని గురువర్యుని శ్రీ పాదము పట్టక గురు శుశ్రూషజేయక త్రికరణ శుద్ధితో ఆచరించక గురుముఖతః యెరుక పరిపూర్ణముల గురించి విచారణ సలుపక స్వచ్ఛంద శిష్యుడైనవాడు యీ పరిపూర్ణ ప్రబోధము కేవలము ఊహాగానముచేత తెలుసుకొనజాలడు గనుక స్వచ్ఛంద శిష్యుడు పరిపూర్ణ ప్రబోధకు అనర్హుడనే చెప్పవలయును. గురుదత్తపుత్రుడై మతిమంతుడైన శిష్యుని ప్రవర్తన భక్తియందును. చతురత యందును అతి విలక్షణముగా యుండును. గురుడు బోధను మానినాగాని మతిమంతుడగు శిష్యుడు తద్బోధను తా మానడు, సరికదా గురుకృపా విశేషమువలన బోధయందు చతురుడై మెలగుచుండును.

గురుశిష్య సాంప్రదాయానుసారముగా గురువనుజ్ఞను బొందకయే తమకు తామై స్వతంత్రముగా గురువులమని ప్రకటించుకొనువారు స్వచ్ఛంద గురువులనబడుదురు. గురుశిష్య సాంప్రదాయమున వీరు కపటచిత్తులు, అహంకార పూరితులు. నీచులుగా పరిగణింపబడుదురు. గురువాజ్ఞానుసారం బోధాధికారము పొంది గురువులైనవారుతమ గురువుగారి ప్రబోధమునే తమ శిష్యులకు బోధించుచుందురు. వీరు గురువులైనను తమ గురువునకు సేవకులమనే భావనకలిగియుందురు. కావున స్వచ్ఛంద గురువులయందుండు అహంకారము వీరియందుండబోదు. స్వచ్ఛంద గురువుల మార్గమట్టిది కాదు. స్వచ్ఛంద గురువులు గురుద్రోహులు. వారి మార్గము చాల నీచమై పాపభూయిష్ఠమైనది. గనుకనే గురువాజ్ఞయివనిదె గురువై శిష్యుల గూర్చి గురుబోధ దెల్పేటి గురువంచకుని యొక్క మార్గము ఛీఛీ తలచరాదామాట ఛీఛీఛీ యని శ్రీ భాగవత కృష్ణదేశికులు శుద్ధ నిర్గుణ తత్వకందార్థములందు సెలవిచ్చినారు.

ఎరుక భ్రమగల్గు శిష్యుని పరితాపము మాన్పునట్టి పండితులెవరో వారే నిజగురువులు. కాని పొట్టకొరకు గురువులమని చెప్పకొను వారందరు గురువులు కాజాలరు. అట్టివారికి పరిపూర్ణబోధ పద్ధతి తెలియుటకల్ల. అభిమానగ్రస్తులైన వీరు పరిపూర్ణబోధ పద్ధతి తెలియజాలక అసంప్రదాయకమైన వ్యాఖ్యానాలు తాత్పర్యాలు చెప్పేతాము భ్రష్టులయ్యేదేగాక యితరులను కూడ భ్రష్టులను చేయుచుందురు. జపములు తపములు సలుపుచు విపరీత స్మరణచేయుచు వేదాంతార్థంబు అపరిమితంబుగ చెప్పుచు శిష్యకోటిగని మెచ్చుకొరకు తమకు ద్రవ్యములు యిచ్చుకొరకు అపకీర్తిచేతలకు ఢదరి నట్లుగ అగుపడి యుపాయముచేత బ్రతుకు చుందురు. కావున వీరలు

శిష్యవిత్తాపహారకులేగాని హృత్తాపహారులు కాజాలరు. తమ స్వార్థము కొరకు ప్రజలను సత్కర్మాచరణమునుండి కూడ చలింపజేయుచుందురు. స్వచ్ఛంద గురువులకు, లేక మాయా గురువులకు యిట్టి ఆచరణ విధానము సహజమైయుండును. నిజగురు సాంప్రదాయక గురువులతో వీరిని యెన్నటికిని పోల్చతగదు.

# తత్వము

1) వినుమురా విన ఇష్టమైయున్నా లేకున్న నీవిక చనుమురా నును బాట బాగున్నా! జరిమిచే తినుమునగ పులియును వలదువలదని తొలగి పోయిన, విధముయుగునని మదికిదోచి పదిలముగ బోధించుచుంటిని. వి

2) మోదమున మది ప్రొద్దుపోకనురా వినుమనుచు దెలిపితి వాదభేదము లేవు మనకిటురా. వేదశాస్త్ర పురాణ గాథల మీదనున్న పూర్ణభావము సాధనాంతర సూచనైనది సాధు సంఘము జేరి వేగమె వి

3) జనన మరణపు జడుపు దీరునురా లక్షణయుతులై వినిన వారికి యునికి దెలియునురా - జనక, శుక, సాందీప, కృష్ణులు, చనిన మార్గము వలదు యనకుము - వనము విడచిన కోతివిధమున దినము గడచిన దిగులు పడెదవు వి

4) సూటిగను మది నాటు వినుమికరా - శతకోటి వరకును చాటువుల బోధించు చుండెదరా సాటిలేదుర బట్ట బయలుకు చోటులేదుర ఎరుక కెప్పుడు - మాటిమాటికి ద్వాదశి మరి షోడశిలను మదిని దలచుము వి

5) నేను వచ్చితి స్వప్న మందునరా - నావలెనె వచ్చెను - ఏనుగులు గుర్రాలు రథములురా - సేనలు సేనాధిపతులును వేనవేలుగ వచ్చినట్లనె కానరావుర మేల్కొయుందున - కన్నులుండియు గాంచలేముర వి

6) ధరణిలోపాన్నాల వంశమునన్ వరరాజయార్యులు పరమభక్తుల పాలి దైవమురా - హరిహరాదుల కథకుడైయిల గురుపదంబున సేవ లందుచు -మురిపెమున అనసూయ సాధ్వితో ధరణిభారము దీర్చ నిలచెను వి

7) వాసిగను గద్వాల పురమందు వసియించుచుంటిని నాగయాఖ్యను నామధేయమునన్ - మోస వేసములేమి లేకను నాసి దీర్చగ గురుని యాజ్ఞను దాసపాలన జేయుచుంటిని దరికిజేరిన భక్తవరులను వి

# మంగళహారతి

జయమంగళం నిత్య శుభమంగళం జనన మరణము బాపు గురుమంగళం

1. పసిడి గిన్నెలలోన పంచామృతముదెచ్చి పాదపూజలుజేసి పరమార్థమరయ జయ

2. తీరుతీరైనట్టి పతిమళపు కుసుమములు - ధూప దీపంబులు తోయంబులొసగన్ జయ

3. ఆత్మనాత్మలుగాని అచల బోధను బడసి - అశరీరులైనట్టి అమల మూర్తులకు జయ

4. ద్వాదశి షోడశి ధర్మమర్మము దెలుపు - శివరామ దీక్షితా సిద్ధాంతులకును జయ

5. పొన్నాల రాజేంద్రు పూర్ణ కరుణను బడసి - ఆచార్యుడైనట్టి నాగార్యునకును జయ

6. సహజానందను దీక్ష సద్గురుచే బడసి శిష్యపాలన జేయు శ్రీమంతు నకును జయ

# గ్రంథ ముద్రణకై గురుదక్షిణ

| | | |
|---|---|---|
| 1) | గడిసె పెద్ద జంబులయ్య | రు 550 |
| 2) | అగ్నూరు లింగప్ప | రు 550 |
| 3) | చిల్లర చిన్నలక్ష్మన్న | రు 550 |
| 4) | అగ్నూరు అక్కమ్మ | రు 550 |
| 5) | దూళ పెద్ద సుబ్బయ్య | రు 550 |
| 6) | దూళ చిన్న సుబ్బయ్య | రు 550 |
| 7) | బుగుడె నాగప్ప | రు 550 |
| 8) | సర్ల సవారప్ప | రు 550 |
| 9) | సర్ల నారాయణ | రు 550 |
| 10) | సర్ల సవారప్ప | రు 550 |
| 11) | దూగూరు నాగప్ప | రు 550 |
| 12) | సర్ల జంబులయ్య | రు 550 |
| 13) | అగ్నూరు నాగమ్మ | రు. 300 |
| 14) | కనికె హంపమ్మ | రు 100 |
| 15) | సర్ల దానమ్మ | రు 100 |
| 16) | గడిసె చిన్న జంబులయ్య | రు 100 |
| 17) | సర్ల తిమ్మప్ప | రు 50 |
| 18) | ఉండవెల్లి గిడ్డారెడ్డి | రు 50 |